C TPLA12281-70



8వ అఖిలభారత

# రైతు మహాసభ

బెజవాడ

1497

8వ అఖిలభారత

# రైతుమహాసభ



ప్రజాశక్తి కార్యాలయం

:: బెజవాడ ::

ప్రజాశక్తి ప్రచురణ నెం. 63
మే 1944

# వి ష య సూ చి క.



ఎనిమిదణాలు

3326

# పరిచయం

8 వ అఖిలభారత రైతుమహాసభ బెజవాడలో విజయవంతంగా జరిగింది. ఆంధ్ర రైతుఉద్యమంలోను, అఖిలభారత రైతుఉద్యమ చరిత్రలోనూ, ఒకనూతన దశకు పునాదివేసింది. ఈసమావేశమెంత జయప్రదంగా జరిగిందీ, ఈ పుస్తకంలో ప్రకటించిన వివిధ వ్యాసాలనుండి పాఠకులే తెలుసుకుంటారు.

ఈ మహాసభను ఇంత దిగ్విజయంగా జరుపగలశక్తి ఆంధ్ర రైతాంగానికి ఏవిధంగా గల్గిందీ కామ్రేడ్ వాసు, తన ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసంలో చక్కగా వివరించాడు.

కామ్రేడ్ వాసు ఉపన్యాసభాగాలు :

ఇదంతా సాధ్యమయిందంటే, ఆంధ్రరాష్ట్రంలో రైతుసంఘం రైతుప్రజా సామాన్యంలో వేళ్ళుపాతుకుపోయిఉంది. మారాష్ట్రంలో జాతీయోద్యమం నుండి రైతుఉద్యమం పుట్టింది. మొదటినుంచీ ఆంధ్రరైతాంగం జాతీయోద్యమాన్ని బల పరుస్తూవచ్చింది. సహాయనిరాకరణోద్యమం సాగేరోజులలో, పన్నుల నిరాక



వేదికపై కామ్రేడ్ వాసు ఉపన్యసిస్తున్నారు.

రణకు ఆంధ్రరాష్ట్రంకూడాతయారుగా ఉన్నట్లు కాంగ్రెసు నాయకత్వం గుర్తించి, యిక్కడకూడా పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభం కావాలని సూచించింది. 1930—32 ఉద్యమాలలోకూడ ఆంధ్రరైతాంగం పాల్గొని, వాటిని పూర్తిగా బలపరచింది.

అయితే, రైతులు కాంగ్రెసులోచేరి, కాంగ్రెసును బలపరచినంతమాత్రాన సరిపోవనీ, తమకు ప్రత్యేకమైన వర్గసంస్థ ఒకటి ఉండాలనీ, దానిద్వారా తమ వర్గహక్కులకై పోరాడవలసిన అవసరం ఉన్నదనీ, రైతులు, రైతునాయకులు ఆరోజుల్లో గ్రహించారు. అప్పటినుండీ రైతుసంఘాన్ని నిర్మించే కృషి ప్రారంభ మయింది. క్రమంగా ఆంధ్రరాష్ట్రమంతటా రైతుసంఘం నిర్మించబడి, ప్రత్యేక మైన వర్గసంస్థగా వృద్ధిచెందింది. అయితే, అది కాంగ్రెసుతో చాలాదగ్గరసంబం ధాన్ని కలిగియుంది. కాంగ్రెసుకూ - రైతుసంఘానికీ మధ్య ఐక్యతఉండాలి అనే సాంప్రదాయం రాష్ట్రంలో ఏర్పడింది. రైతుసంఘం బలపడితే కాంగ్రెసుకూడా బలపడుతుందనీ, కాంగ్రెసు బలపడితే రైతుసంఘానికికూడా బలంచేకూరుతుందనీ, దృఢవిశ్వాసంతో పనిచేశాం.

## వ్యవసాయకూలీ ఉద్యమం

ఇలా నానాటికీ వృద్ధిచెందే రైతు ఉద్యమానికి ఆంధ్రరాష్ట్రంలో వ్యవసాయ కూలీ ఉద్యమం కొత్తబలాన్ని యిచ్చింది. 1930 వ సంవత్సరం లగాయతు చాలా చోట్ల వ్యవసాయకూలీ సంఘాలు బయల్దేరి, బలపడ్డాయి సామాన్యంగా వ్యవసాయ కూలీలు కోరే హక్కులు రైతులకు వ్యతిరేకంగా పరిణమించుతూ వచ్చినప్పటికీ, రైతులు యీ కొత్తసంఘాల అభివృద్ధికి ఆమోదం తెలియజేయనప్పటికీ, యీ రెండు సంస్థలమధ్య ఐక్యతను నెలకొల్పడానికి మేము మొదటినుంచీ ప్రయత్నిస్తూ వచ్చాం. మా ప్రయత్నాలు క్రమక్రమంగా ఫలించ నారంభించాయి. ఈరోజున రైతులు, వ్యవసాయకూలీ సమిష్టి హక్కులకొరకు కలసి పోరాడుతున్నారంటే మేం అవలంబించిన విధానం యెంత సరియైనదో తెలియగలదు.

ఈ విధంగా, కాంగ్రెసు—రైతుసంఘాలమధ్య, రైతు—వ్యవసాయకూలీల మధ్య సమకూరిన ఐక్యతే గత 4 సంవత్సరాలలో మన ఉద్యమాన్ని కాపాడిన మహాశక్తి. ఈ శక్తిని సామ్రాజ్యవాదుల నిర్బంధవిధానం నాశనం చేయలేక పోయింది. రంగా గ్రూపు 1942 లో రాష్ట్ర రైతుసంఘాన్ని రద్దుచేసినప్పుడు కూడా యీ శక్తే రైతుసంఘాన్ని కాపాడింది. ఇదే రైతు ఉద్యమ నిర్మాణాన్ని వృద్ధిచేసింది.

## రంగాముఠా విచ్ఛిన్న ప్రయత్నాలు విఫలమయ్యాయి

అఖిలభారత కిసాన్‌సభనుంచి రంగాముఠా 1932లో చీలిపోయింది. రైతాంగ ప్రజలు తమనే అనుసరించుతారనీ, కిసాన్‌సభను అనుసరించరనీ మొదట వారు ఆశించారు. అఖిలభారత కిసాన్‌సభపై దాడివెడలడానికి యీ రాష్ట్రాన్ని పునాదిగా చేసికోవాలని చూచారు. కాని, రైతాంగం వారికి చక్కగా బుద్ధిచెప్పింది. రైతులు అఖిలభారత కిసాన్‌సభ జెండాక్రిందనే సమీకరణ అయ్యారు. రాష్ట్ర సంఘం రద్దు చేయబడినమీదట. అఖిలభారత కిసాన్‌సభ ఆంధ్రరాష్ట్రానికి ఒక ఆర్గనైజరును నియమించింది. రెండు నెలలలోనే 60,000 సభ్యులు రైతుసంఘాలలో చేరారు. ఈ యేడాది ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ సభ్యత్వం 101,000 వరకు పెరిగింది.

## మన విజయాలు

ఈదశలో ఆంధ్రరైతాంగానికి మనం చేసినసేవ ఫలితంగా అనేక విజయాలను సాధించగల్గాం; రైతాంగాన్ని నిత్యం యెదుర్కొంటున్న ఇబ్బందులను పరిష్కరించడానికి పూనుకొనడంవలన మన రైతుసంఘాలు ప్రజాభిమానాన్ని బాగా చూరగొనగల్గుతున్నాయి. గతసంవత్సరం పంజాబురాష్ట్రంలో, భాక్నాలో సమావేశమైన 7వ అఖిలభారత రైతుసహాసభ యిచ్చిన కార్యక్రమాన్ని, నినాదాలను ఆచరణలో పెట్టగల్గడంవలననే యిదంతా సాధ్యమైంది; యీదశలో రైతుల ప్రయోజనాలను చక్కగా కాపాడగల్గే సరియైన రాజకీయార్థిక పంథాను మనం అనుసరించడం వల్లనే యిదంతా సాధ్యమైంది.

గత సంవత్సరం అఖిలభారత రైతుమహాసభ రైతాంగానికి యిచ్చిన కార్యక్రమమేమి ? దేశరక్షణకొరకు, ప్రజలపోషణ కొరకు రైతులు అధికాహారోత్పత్తిని గావించాలి. దేశంలో నానాటికి తీవ్రమౌతున్న ఆహారసమస్యను పరిష్కరించడానికి రైతాంగం చొరవతో ముందుకొచ్చి పూనుకోవాలి. ప్రజలకూ, జపాను ఫాసిస్టు దురాక్రమణదారులను యెదుర్కొంటూ దేశసరిహద్దులనుకాపాడుతూవున్న సైనికులకూ మనం పండించే ఆహారపదార్థాలను అధికలాభాలు గుంజేవ్యాపారస్థులకు, తిండిదొంగలకు, చేజిక్కనివ్వకుండా, అందజేయడానికి పూనుకోవాలి. ఆహారసమస్య క్లిష్టమవ్వడంతో దేశం నలుమూలల వ్యాపిస్తూవున్న కరువును పరిష్కరించడానికి రైతాంగం పూనుకొని పనిజేయకపోతే, వచ్చే ప్రమాదకర పరిస్థితులగూర్చి హెచ్చరిస్తూ రైతుసంఘాలు ఆహారసమస్యపై కేంద్రీకరించి పని చేయాలని ఆదేశించింది. జాతీయ సంక్షోభ ఫలితంగా దేశంలో యేర్పడ్డ రాజకీయ ప్రతిష్టంభనను అంతంగావించడానికి, దేశరక్షణను జయప్రదంగా కొనసాగించే

జాతీయ ప్రభుత్వాన్ని సాధించడానికి, కాంగ్రెసు - లీగు ఐక్యత కొరకు మనం కృషిచేయాల్సిన అవసరాన్ని స్పష్టీకరించింది. పై కార్యక్రమాన్నంతా యజప్రదంగా సాగించడానికి రైతాంగపు సంఘటితశక్తిని పెంపొందించి, బలిష్టమైన రైతువుద్యమాన్ని నిర్మించడానికి రైతుసంఘ నిర్మాణాన్ని దిట్టపర్చాలని ఆదేశించింది.

ఈ కార్యక్రమమే రైతుల ప్రయోజనాలను కాపాడగల్గిన కార్యక్రమ మనుటకు మనం యింతవరకు సాధించిన విజయాలే నిదర్శనం. అఖిలభారత రైతువుద్యమంలో యింతవరకు యెన్నడూ యెరుగని ప్రజాసమీకరణను యిప్పుడు మనం యీ మహాసభ సందర్భంలో చేయగల్గడమే యిందుకు తార్కాణం!

## అధికాహారోత్పత్తి

దేశరక్షణకొరకు, ప్రజలను పోషించడానికి అధికాహారోత్పత్తి గావించడం మన ప్రధాన కర్తవ్యం. యిదే యీదశలో మనం గావించాల్సిన దేశభక్తిపూరితమైన కర్తవ్యం! అంతేగాకుండా అధికాహారోత్పత్తిని గావించడానికి పూనుకోవడం ద్వారానే మన దైనందిన కోర్కెలుగూడ సాధించగల్గాం. ఆంధ్ర రైతువుద్యమ చరిత్రలో మొట్టమొదటిసారి జమీందారులు తమ అధీనంలోవున్న నీటి వనరులను (చెరువులు, కాల్వలు, వాగులు) తప్పనిసరిగా బాగుచేయించాలనీ, లేనిచో రైతులే బాగుచేయించి అందుకయ్యే ఖర్చులను శిస్తులనుండి మినహాయించుకోవచ్చుననీ ప్రభుత్వంచే ఒక శాసనం చేయించగల్గాం. రైతుసంఘాలు ఉత్పన్నమైనప్పటి నుండి యీ హక్కుకోసం ఆందోళనచేస్తూ వచ్చాం. ఇంకా అనేక ప్రాజెక్టులను (రాయలసీమ, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలలో) నిర్మించడానికి ప్రభుత్వం పూనుకొనేలా చేయగల్గాం. కొన్నిటి నిర్మాణం (తుంగభద్ర పల్లపుకాల్వ, సంగమేశ్వర ప్రాజెక్టు, యింకా కొన్ని మైనరుప్రాజెక్టులు) అపుడే ప్రారంభమయ్యాయి గూడ. వీటిద్వారా కొన్ని లక్షల యెకరాల భూమి అదనంగా సాగులోకి వస్తుంది. నీటి సదుపాయాలున్నచోట్ల వాటిని అధికం చేయడానికి కృషిచేశాం.

ఇంతేగాక గత సంవత్సరం రాష్ట్రంమొత్తంమీద 12,000 యెకరాల బంజరు భూమిని వ్యవసాయకూలీల కిప్పించి సాగు చేయించగల్గాం, జమీందారీ బంజరు భూములనుగూడ సాగులోనికి గొనిరావడానికి ప్రభుత్వంచేత శాసనం చేయించగల్గాం. బంజరుభూములను సాగుచేసే సందర్భంలో స్థానికోద్యోగులు నిరంకుశంగా విధించిన అధిక పెనాల్టీలను నామమాత్రపు రేట్లకు తగ్గించివేసేటట్లు చేయగల్గాం. అదివరకే సాగవుతున్న డెల్టా భూములనుండి అధికంగా పంటలు పండించడానికి రైతులు ఆధునిక వ్యవసాయ పద్ధతుల నవలంబించేటట్లు చేయ

గల్గాం. శ్రేష్ఠమైన విత్తనాలు కొనడానికి, యెరువులు కొనడానికి ప్రభుత్వం వద్ద నుంచి 5 లక్షల రూపాయలవరకూ రైతు సంఘాలద్వారా అప్పుగా యిప్పించ గల్గాం. ఈ సంవత్సరం ప్రభుత్వం విత్తనాలకొరకు, యెరువులకొరకు, 1 కోటి, 26 లక్షల రూపాయలవరకు రైతులకు అప్పుగా యివ్వడానికి అంగీకరించేటట్లు చేయగల్గాం. వ్యవసాయ పనిముట్లు, ముఖ్యంగా యినుప పనిముట్లు, ప్రభుత్వ వ్యవసాయశాఖద్వారా సరఫరా చేయడానికి పూనుకొనేటట్లు చేయగల్గాం.

## ఆహార సమస్య

మన రాష్ట్రం ప్రధానంగా ఆహార పదార్థాలను వుత్పత్తిచేసే రాష్ట్రం అయి వుండటంవల్ల, ఆహారసమస్యను పరిష్కరించడానికి అధికాహారోత్పత్తి మన ప్రధాన కర్తవ్యమైనా, మనం పండించే ఆహారపదార్థాలను ప్రజలకు అందుబాటులో వుండే ధరలకు అందజేయాల్సిన బాధ్యతగూడ మనపైవుంది. లేనిచో బెంగాలులో ఏర్పడ్డ విషమపరిస్థితులే ఏర్పడుతాయి. అందుచేత అధికాహారోత్పత్తి చేయడంతో బాటు, మనం పండించే పంటనంతా ప్రజల కందుబాటులోవుండే ధరలకు అమ్మేలా చేయడానికి పూనుకొన్నాం. స్థానికంగా తిండికై బాధపడే వ్యవసాయ కూలీలకు, పేద ప్రజలకు తక్కువ ధరలకు కరువురోజుల్లో ధాన్యాన్ని సప్లయిచేసి, స్థానికంగా కరువుపరిస్థితులు, అరాచక పరిస్థితులు యేర్పడకుండా చూడగల్గాం. వ్యవసాయ కూలీలకు కరువుమాసాల్లో సహాయపడ్డానికి రైతు-కూలీ సామరస్యాన్ని నెలకొల్పుతున్నాం. తరుగు ప్రాంతాలకు, కరువు ప్రాంతాలకు, మనవద్దనున్న అదనపు సరుకును ఆహారకమిటీలద్వారా, ప్రభుత్వపు కొనుగోలుశాఖద్వారా ప్రజల కందుబాటులోవుండే ధరలకు సప్లయిచేయడానికి ముందుకొస్తున్నాము. ప్రభుత్వం నిర్లక్ష్యత చూపెడుతున్నా, తిండిదొంగలు యెన్ని కుతంత్రాలు పన్నుతున్నా, పట్టుదలతో పని చేస్తున్నాం.

## రాయలసీమ కరువు

రాయలసీమ కరువు నివారణ కొరకు తీవ్రంగా కృషిజేశాం. కరువునివారణ నిధిని స్థాపించి, రు 8000/- లకు పైగాను, కొన్నివేల బట్టలను కరువుబాధితుల సహాయార్థం పంపగల్గాం. సోదర రాయలసీమ రైతు లనుభవించుతున్న కరువు బాధ వైపుకు ఆంధ్రప్రజాదృష్టిని ఆకర్షించగల్గాం. దీనిఫలితంగా ఆంధ్రమహాసభ రాయలసీమ బాధితుల కరువునివారణ నిధిని యేర్పరచి తోడ్పడింది. ఇంతేగాక ప్రభుత్వం 2½ కోట్లు ఖర్చుపెట్టి నడిపిన కరువు క్యాంపులలో రాష్ట్ర రైతుసంఘం తరఫున మనం పంపించిన రైతుసేవకులు పనిజేశారు. కరువు బాధితులకు కూలి

సరిగా ముట్టునట్లుగాను, వైద్యసహాయం అందునట్లుగాను, - చౌకడిపోలద్వారా ఆహార పదార్థాలు దొరుకునట్లుగాను కృషిచేశారు. దీనిఫలితంగా రాయలసీమలో రైతు వుద్యమం, ప్రజాఐక్యత యెంతో అభివృద్ధిచెందాయి.

రాయలసీమ కరువు నివారణకై గావించిన కృషితోపాటు మలబారు, బెంగాలు కరువునివారణకై రైతుసంఘాల తరఫున పనిజేశాం. మలబారు, బెంగాలు రాష్ట్రాలలో వచ్చిన భీషణకరువు పరిస్థితులు మన రాష్ట్రంలోకూడా యేర్పడరాదనే సంకల్పం మనలో ఏర్పడింది. ఆహారపదార్థాల ధరల కంట్రోలు, రేషనింగు, ఆహారసమస్యను పరిష్కరించడానికి అత్యవసరమని గుర్తించి, వాటికొరకై ఆందోళన గావిస్తున్నాం. ధాన్యపుబస్తా ధర రు 20/- వరకు పెరగాలని ప్రారంభంనుండి ఆందోళన గావిస్తున్న రంగాముఠా, జస్టిస్‌పార్టీ సహితం మన ఆందోళన ఫలితంగా ఆ నినాదాన్ని వదులుకోవాల్సివచ్చింది. ఆహారపదార్థాల, జీవితావసర వస్తువుల ధరలకు కంట్రోలు వుండడం రైతులమైన మనకే శ్రేయస్సు అనేది నిర్వివాదాంశం.

## రైతు - కూలీ సామరస్యం

కాంగ్రెసు - లీగు ఐక్యతకొరకు మన రాష్ట్రంలో పనిజేయడమంటే రైతు-కూలీ సామరస్యాన్ని పెంపొందించడమనీ, అదే విశాలమైన గ్రామైక్యతకు, తద్వారా జాతీయైక్యతకు, దారితీస్తుందనే ముఖ్యవిషయాన్ని మనం అనుభవంద్వారా గ్రహించాం. వ్యవసాయ కూలీలకు సక్రమమైన వేతనాలు యిప్పించడం, కరువు రోజుల్లో తక్కువ ధరలకు అప్పులివ్పించడం, కూలీసంఘాలతో చర్చించి రైతులకు, కూలీలకు వచ్చేతగాదాలను తీర్చడం — యివి కూలీ-రైతు సామరస్యాన్ని పెంపొందించుతున్నాయి. కూలీలలో నూతన చైతన్యాన్ని గొలివస్తున్నాయి. అధికాహారోత్పత్తికై యిదివరకుకంటె హెచ్చు బాధ్యతతో క్రమశిక్షణతో, వుత్సాహంతో కూలీలు పనిజేయడం ప్రారంభించారు. రైతులు - కూలీలు ఒందొరుల మధ్య పరస్పర విశ్వాసం, ఆదరాభిమానాలు హెచ్చి సామరస్యం యేర్పడుతోంది. స్థానిక జమీందార్లు, స్వార్థపరులు గ్రామాల్లో కక్షలుపెంచి తమ పెత్తనాన్ని సాగించుకొనే అవకాశాలు సన్నగిల్లుతున్నాయి. రైతు-కూలీ సామరస్యం కొరకు మనం గావించే కృషిఫలితంగా గ్రామాల్లో నూతన జీవితం నూతన చైతన్యం, బలిష్టమైన గ్రామైక్యత యేర్పడుతున్నాయి.

## యుద్ధ బాండులు

యుద్ధ ఋణపత్రాల సమస్యను యిటీవలనే తీసుకుని పనిజేశాం. యుద్ధ బాండులను కొనిపించడంలో అధికారులు రైతులను నిర్బంధించకుండా ఆపుచేయడానికి, దేశరక్షణకొరకు మన రైతు సంఘాలు కృషిచేస్తున్నాయి. రైతులు తమ శక్తిననుసరించి యుద్ధబాండులు కొనవచ్చునని ప్రచారంచేశాం. కొనగలిగినవారిచేత కొనిపించాం. యీవిధంగా చేయడంవల్ల విచక్షణ రహితంగా ప్రభుత్వోద్యోగులు రైతులను నిర్బంధించడం ఆపివేయగల్గాం. పేదరైతులు ప్రభుత్వోద్యోగుల నిర్బంధ వసూళ్ళకు గురికాకుండా కొంతవరకు కాపాడగల్గాం.

పై ప్రధాన సమస్యలను పరిష్కరించడంతోపాటు రైతాంగాన్ని నిత్యం యెదుర్కొంటున్న యిబ్బందులను తీర్చడానికి పనిచేస్తున్నాం. గ్రామకక్షలు పోగొట్టడానికి, రైతులమధ్య వచ్చే వ్యక్తికక్షలను, పోట్లాటలను తీర్చడానికి తీవ్రంగా కృషిజేస్తున్నాం. గ్రామపెత్తందార్లు గ్రామంలోని పేదా, బిక్కాని తమ నిరంకుశ చర్యలకు గురిచేయకుండా కాపాడుతున్నాం. రైతుసంఘాలు రైతుల నిత్యజీవితంలో ప్రధానపాత్రవహిస్తూ వారి ఆదరాభిమానాలను చూరగొంటున్నాయి. వీటన్నిటి ఫలితంగా గ్రామంలో నూతన చైతన్యం, నూతన ఆదర్శాలు వుత్పన్నమౌతున్నాయి; నూతన ప్రపంచానికి పునాది పడుతోంది.

## రంగాముఠా విచ్ఛిన్నచర్యలు

రైతుల ప్రయోజనాలను కాపాడడానికి, దేశరక్షణను బలపర్చడానికి, మనం ఈవిధంగా కృషిచేస్తుంటే రంగాముఠా తమ విచ్ఛిన్నచర్యలను ప్రజలకు, దేశరక్షణకు హానికరమైన కార్యాలను సాగిస్తూనేవున్నారు.

ఆహారసమస్య తీవ్రమై దేశమంతటా, కరువు ప్రమాదం వ్యాపిస్తూన్నపుడు, ఆహారసమస్యా పరిష్కారంకొరకు, అధికాహారోత్పత్తికొరకు, కరువు నివారణ కొరకు కృషిజేస్తూ, మన ప్రజలను, మన ప్రాంతాలను కరువుబాధనుండి కాపాడుకోవాల్సిన అవసరమున్నప్పుడు రంగాముఠా యేమిచేస్తోంది? ఆహారసమస్యపై అందరూకలిసి పనిచేయడానికి నిరాకరిస్తోంది; ఆహార కమిటీలను పెట్టవద్దని, అధికాహారోత్పత్తి గావించవద్దని రైతుల్లో ప్రచారంచేస్తోంది. కరువునివారణకై పనిజేయకపోవడమేగాక, మనం జేస్తుంటే నీచాతినీచమైన దుష్ప్రచారం గావించుతోంది. మనం ధరలకంట్రోలు విధానం యేర్పరచి, ఆహారసమస్యను పరిష్కరించడానికి, ప్రజల ఆర్థిక జీవితం విచ్ఛిన్నంగాకుండా చూడడానికి ప్రభుత్వం

పూనుకోవాలని ఆందోళన గావిస్తుంటే ధాన్యపు ధరలు పెరగాలనే అరాచకపు నినాదాలను యిస్తోంది అధిక లాభాపేక్షతో ప్రజల యోగక్షేమాలు రవ్వంతైనా మనస్సులో పెట్టుకోని తిండిదొంగలను మాత్రమే యీ నినాదం బలపరుస్తుంది. ప్రజల ఆర్థిక జీవితాన్ని తారుమారుజేసి, గ్రామాలను, పట్టణాలను అరాచకత్వానికి గురిజేస్తుంది.

అన్నిరకాల ఆహారపదార్థాల ధరలను కంట్రోలుచేసి, రేషనింగు పద్ధతిపై వాటిని ప్రజలకు అందజేయడంద్వారానే ఆహారసమస్య, కరువుసమస్య పరిష్కారం కాగలవు. ఆహారపదార్థాల ధరలు యింకా పెరగాలనే నినాదం అన్నదాతయైన రైతు దేశభక్తికి, స్వార్థత్యాగానికి, గౌరవానికి భంగకరం. దేశభక్తిపూరితులమైన మనంకోరే కోర్కెగాదు. స్వలాభపరులైన వ్యాపారస్తులు, తిండి దొంగలు అనుసరించే దోపిడీ విధానం అది.

నేడు దేశంలో యేర్పడ్డ రాజకీయ ప్రతిష్టంభనను తొలగించడానికి, దేశ రక్షణను బలపర్చగల జాతీయప్రభుత్వాన్ని సాధించడానికి, జాతీయైక్యతను నిర్మించుకోవడం మన ప్రధాన కర్తవ్యమైవుంది. స్థానికంగా మనకున్న యిబ్బందులను నివారించుకోడానికి మన సంఘటితశక్తి, ఐకమత్యత బలపడాలి. మన జాతీయోద్యమంయొక్క బలమంతా మన ప్రజాసంఘాల బలమంతా, మనమింతవరకు నిర్మించిన ఐక్యతపైనే ఆధారపడివుంది. ఆ ఐక్యతను కాపాడుకుంటూ, పెంపొందించుకుంటూ వున్నప్పుడే సర్వతోముఖాభివృద్ధి కలుగుతుంది. ఈ పరిస్థితుల్లో రంగాముఠా ఏంచేస్తోంది? జాతియైక్యతకొరకు, కాంగ్రెసు - లీగ్ ఐక్యతను నెలకొల్పడానికి కృషిచేయాలని మన అఖిలభారత రైతుసంఘం ఆదేశిస్తూంటే, ముస్లింలీగ్ ప్రభుత్వ ఏజెంటు అంటూ దానిపై దుష్ప్రచారంజేస్తూ, హిందూ - ముస్లిమ్ కొట్లాటలకు దారితీసేపంథాను అవలంబిస్తోంది. జాతీయ సంక్షోభాన్ని పరిష్కరించడానికి, దేశరక్షణను బలపర్చడానికి యిది మార్గంగాదు; జాతీయ సంక్షోభాన్ని తీవ్రపర్చేమార్గం.

రంగాముఠా యింతటితో ఆగలేదు. యింతవరకు మనమందరం కలిపి నిర్మించిన రైతువుద్యమాన్ని విచ్ఛిన్నంచేయడానికి సర్వవిధాలా ప్రయత్నిస్తోంది. పోటీ రైతుసంఘాలు పెట్టడం, వున్న సంఘాలను చీల్చడం - యిదీ వాళ్ళు రైతు వుద్యమాన్ని నిర్మించే విధానం. ఇది నిర్మాణమో, విచ్ఛిన్నమో నేను చెప్పనవసరంలేదు. వారి రైతువుద్యమ విచ్ఛిన్నచర్యలు యెంత నీచమార్గాన పోయాయో— చరిత్రాత్మకమైన యీ మహాసభను విచ్ఛిన్నం గావించడానికి వాళ్ళు సర్వవిధాల చేసినకృషి మీకు తెలిసిందే; మహాసభకు చందాలివ్వవద్దని, మహాసభను బహి

ష్కరించమని, వాళ్ళుగావించిన దుష్ప్రచారానికి మీరందరూ తగినసమాధానమిచ్చి ఆంధ్రరాష్ట్ర రైతుసంఘంయెడల, అఖిలభారత రైతుసంఘంయెడల మీ గాఢ ప్రేమాభిమానాలను వెల్లడించారు; విచ్ఛిన్నచర్యలకు చావుదెబ్బకొట్టారు. దేశభక్తితో కూడుకొని, రైతులసేవయే జీవితాశయంగా పెట్టుకున్న దేశభక్తులైన రైతు సేవకులందరూ ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం అనుసరిస్తున్న పంథాయే సరియైన పంథా అని యిప్పుడైనా తెలుసుకొని ఆంధ్ర రైతువుద్యమాన్ని బలపర్చుతారని, ఆంధ్రరాష్ట్ర రైతుసంఘంతో సహకారం జేస్తారని ఆశిస్తున్నాను.

## కరువు రైతులకర్తవ్యం

కరువు రైతులకర్తవ్యం. కొన్ని నెలలనుండి మన దేశం అంతటా కరువు రాక్షసి నృత్యం చేస్తోంది. అన్ని ప్రాంతాలకు యిది వ్యాపించింది. ముఖ్యంగా బెంగాల్‌లో దాదాపు 50 లక్షల మందిని తన పొట్టను పెట్టుకుంది. అప్పటికీ అనేక జిల్లాలలో అంటువ్యాధులవల్ల ప్రజలు మరణిస్తున్నారు. బెంగాల్‌లో గతసంవత్సరం వలె ఈయేడుకూడా యెక్కువ భీకరమైన రూపాన కరువువచ్చే సూచనలు కన్పించుతున్నాయి.

ఇలాంటి క్షామం ఒక బెంగాల్‌లోనేకాదు. కేరళలోను, ఒరిస్సాలోను, రాయలసీమలోనూ క్రిందటియేడాది తాండవమాడింది. ఈ సంవత్సరం మరింత దుర్భరమయ్యే సూచనలు కన్పించుతున్నాయి. నేడు మన ప్రజలను పీడించుతున్న కరువు, ఆకలిమంటలు మరింత ప్రజ్వరిల్లేలా వున్నాయి.

విషాదకరమైన క్షామమేగాకుండా, యుద్ధపరిస్థితులుకూడ మనలను పీడించుతున్నాయి. ఈ విషయాన్ని అధికారులు నిర్లక్ష్యంచేసినా, మనం ఉపేక్షవహించలేం. మొత్తంమీద ఫాసిస్టులమితా యుద్ధంలో దెబ్బలు తింటున్నా జపాను దుండగీడులు యింకా మనదేశ సరిహద్దునేవున్నారు; ఎపుడైనా దండయాత్రచేయవచ్చును. వాస్తవానికి గత ఐదువారాల్లో బెంగాలులోకి చొచ్చుకుపోవడానికి జపాను వాళ్ళు ప్రయత్నించి ఓడిపోయారు. క్షామపీడిత బంగాలులోకి శత్రువు రాగలిగితే, దేశం ఎంత ప్రమాదానికి గురిఅవుతుందో వేరుగా చెప్పనక్కరలేదు.

మనం ఆర్థికంగా యింత ప్రమాదకరమైన స్థితిలో వుండటానికి కారణం ఏమిటి? ఇతర అన్నిరంగాలలోనూ తోకముడుస్తున్న ఫాసిస్టు మూకలు మన సరిహద్దునే యింకా ప్రమాదకరంగా పొంచి వుండటానికి (నేడు అస్సాంలోకి, మణిపూరులోకి జపానుశత్రువులు చొచ్చుకవచ్చారు) కారణం ఏమిటి?

నాయకులు జైళ్ళలోవున్నారు. కరువుసమస్యను పరిష్కరించడానికి, దేశాన్ని రక్షించడానికి, ప్రజలనందరిని సమీకరించడానికి పూర్తి అవకాశం లేకుండా పోయింది. క్షామాన్ని తొలగించడానికి, జపాను ఫాసిజాన్ని ఎదిరించడానికి అవసర మైన ప్రజాప్రతినిధులతోకూడిన జాతీయప్రభుత్వంలేదు ప్రజలతో సంబంధంలేని నిరంకుశాధికారవర్గం మనలను పాలించుతూంది. అందుచే ఆహారపదార్థాలనుదాచే తిండిదొంగలు, పంచమాంగదళంవారు వగయిరా - ప్రజా విరోధులంతా - దేశభక్తి బురఖా వేసికోగల్గుతున్నారు. యుద్ధరంగంలోవున్న సైనికులలోనూ, వెనుకవున్న ప్రజలలోనూ, నిరుత్సాహం కల్గించజూస్తున్నారు.

## రైతులకర్తవ్యం

ఈ సమస్యలన్నింటినీ పరిష్కరించడానికి రైతులందరూ ఐక్యమవ్వాలి! రైతుసంఘాల్లోజేరాలి! రైతుసంఘ నాయకత్వాన తమ యిబ్బందులను తీర్చు కోవాలి; తమహక్కులను సాధించాలి!

••



కూర్చున్నవారు కుడినుంచి ఎడమకు : 1. అబ్దుల్లారసూల్ 2. ముజఫర్‌అహమ్మద్ 3. జగత్‌సింగ్ 4. బంకింముఖర్జీ 5. స్వామీజీ 6. వాసుదేవసింగ్ 7. అచ్చర్‌సింగ్‌చిన్నా 8. యదునందనశర్మ 9. పెరులేకర్ 10. నంబూద్రిపాద్

నిల్చున్నవారు కుడినుంచి ఎడమకు : 1. నండూరి ప్రసాదరావు 2. సుందరయ్య 3. గోపాలహల్దారు 4. సాధుచరణమహంతి 5. కృష్ణబినోదరాయ్ 6. హర్షదేవమాలవీయ 7. అత్తాడిల్లాజహానియా 8. భైరవభారతీయన్ 9. మాధవరావుదేశపాండే 10 కరుణసింధ్‌రాయ్ 11. కేరళీయన్ 12. రమేష్‌చౌహర్

# భారత రైతాంగంలో ★ మహోజ్వల చైతన్యం

— పి. సి. జోషి



బెజవాడలో జరిగిన అఖిల భారత రైతు మహాసభ (మార్చి 14–15) మన ప్రతికక్షులకేగాక, ఇతర రాష్ట్రాలనుండి వచ్చిన రైతు వర్కర్లకుకూడ ఆశ్చర్యం గల్గించింది. మహాసభను జరగకుండా చేయాలని ప్రయత్నించిన విచ్ఛిన్నకులు సైతం తమలోతాము, మహాసభను నిరోధించడం అసంభవమని అంగీకరించవలసి వచ్చింది. మనమంతా కన్న మధురస్వప్నాల కంటెకూడ అద్భుతంగా జరిగింది సభ.

మహాసభా స్థలమే ఎంతో చక్కనిచోట వుంది. బెజవాడ సమీపంలోని మొగల్‌రాజపురంలో సభాస్థలం. అటు పట్టణానికి ఇటు పల్లెకూ ఉండే అవకాశాలన్నీ ఉపయోగించుకోడానికి వీలయింది. ఇంతేగాదు. మహాసభాస్థలానికి శోభకూర్చినవి మొగల్రాజపురం కొండలు. ఈ మూడు కొండలూ మామూలువిగావు. బౌద్ధశిల్పంతో గూడిన గుహలతో నిండి వున్నాయి. అవి నన్ను మాటిమాటికీ ముగ్దుడ్నిచేశాయి. భారతీయులు, చైనావారు ఆ శిల్ప సంపదనుజూచి తన్మయులవుతూ వుంటారని నేను భావిస్తున్నాను. ఆ

ప్రాచీన శిధిలాలు ప్రస్తుత దౌర్భాగ్యస్థితికి వ్యతిరేకంగా పోరాడమని ఉద్బోధించుతున్నాయి. మన ప్రజలు ఊరికే స్తబ్ధులుగా కూర్చోలేదు. అలాగే ఈకొండలూను. ఈ కొండలు ఉపయోగపడుతున్నాయి. మిలమిల నున్నగా మెరిసే ఆ నల్లటి దేహంతో ఆంధ్రకార్మికులు ఆ కొండల్ని బ్రద్దలుకొడుతున్నారు. సజీవమైన జానపదాలతో సంగీతసుధ లొలికించుతున్నారు. అప్పుడే బ్రద్దలయిన కొండలమీద సూర్యకిరణాలు ప్రసరించి రకరకాల రంగులు కల్పిస్తున్నాయి. భారతదేశ గ్రామంలోని నిరాడంబరత, ఆ కొండలక్రింది పచ్చనిపంట భూముల్లో ప్రస్ఫుటమౌతోంది.

రైల్వేస్టేషన్‌నుండి మహాసభాస్థలానికి వెళుతున్నాం. ప్రథమ వీక్షణంలోనే, వంకరటింకర రోడ్ల వెనుక పొడుగాటి చెట్లతోను మామిడితోపులతోను నిండివున్న మామూలు గ్రామంలా కన్పట్టలేదు; కాంగ్రెస్ నగర్‌లా కన్పించింది.

మొన్న మొన్నటి వరకు అదిఅంతా రైతుల పంటభూమి. ఆ వందలఎకరాల భూమిని చదునుచేస్తున్నారు. గ్రామాలలో జరిగిన కాంగ్రెసు మహాసభలలో కంటె కూడ అతి నిరాడంబరంగా, పందిళ్ళు, పాకలు వేస్తున్నారు.

నేను సుందరయ్యను కలుసుకొన్నాను. సుందరయ్య ఇచ్చే అంకెలు చూసి విస్తుపోయాను. వాటినిగురించి నెమ్మది నెమ్మదిగా చెబుతాను. మహాసభఏర్పాట్లు పూర్తిచేయడానికి రెండువారాలు మాత్రమే ఉన్నాయి. మొదట ఒక్క 75 మంది వలంటీర్లు మాత్రమే పని ప్రారంభించారు. లక్షతాటాకులు (ఇందులో చాలా వరకు రైతులుఊరికే ఇచ్చారు) 70వేల వాసాలు, 2500 స్తంభాలతో 'రైతునగర్' నిర్మాణం పూర్తిఅయింది. ఏదోకొద్దిపాటి రాతిపనితప్ప తక్కినదంతా వలంటీర్లేచేశారు.

## రైతు యువకులు

అసలు పనినంతా నిర్వర్తించేది వలంటీర్లు. మార్చి 5వ తేదీకి వాళ్ళు 250 మంది మాత్రమే. 9వ తేదీకి 1000 మంది. కాని 14-15 తేదీలకు దాదాపు 4 వేల మంది అయ్యారు. వలంటీర్లే సభాసన్నాహాలన్నీ పూర్తిచేసి బందోబస్తు గావించారు. వాళ్ళంతా దిట్టమైన రైతుబిడ్డలు పార్టీ వాళ్ళని రాజకీయంగా తర్ఫీదుచేసింది. పార్టీయే వాళ్ళని సంఘటిత పరచింది. వాళ్ళ నాయకులవంక ఒక్కసారి చూస్తే ఈ వలంటీర్లు ఎలాంటివాళ్ళో చప్పున బోధపడుతుంది.

ఒకరకంగా రాజకీయ కమిస్సార్‌లా పనిచేస్తున్న సుందరయ్య పార్టీ నాయకుడు. తమ జీవితంలో ఎరిగి ఉన్నవారందరిలోను ఎక్కువగా సుందరయ్యనే వారు ప్రేమిస్తారు, గౌరవిస్తారు. పంజాబు కామ్రేడ్స్ చెప్పింది ఈ విషయంలో సత్యమే. వాళ్ళిలా అన్నారు : "సుందరయ్యకూ వలంటీర్లకూ భేదం లేదు. వాళ్ల

ల్లోకలిసి పోతాడతను. అందుకనే సుందరయ్య నాయకుడు. అలాంటి నాయకుడు మాకు లేడు. అందుకనే ఆంధ్ర కామ్రేడ్స్ ఇదివర కెన్నడూ ఆర్గనైజు చేయ లేనట్టి మహాసభను ఆర్గనైజు చేయగల్గారు."

రాజేశ్వరరావు వాళ్ల ముఖ్యకమాండర్. ఎంత గట్టిగా అరుస్తూ ఆర్డర్లిచ్చే వాడో, అంత గట్టిగాను పనిచేసేవాడు! స్నానం కూడా చేయకండా ఊపనేమిటని నేనడిగితే ఇలా సమాధానం చెప్పాడు. "అనుకున్న టైముకు 12 గంటలు వెనక బడ్డాం. వలంటీర్లకు స్నానానికి టైంలేదంటూ నేను స్నానాలు, జపాలు చేస్తూ ఎలా కూర్చోను?"

వాసుదేవరావు ఆహ్వాన సంఘాధ్యక్షుడు. 1937 లో రైతు రక్షణయాత్రను విశాఖపట్టణంనుండి మద్రాసుకు నడిపాడు. ఆయాత్రతో ఆంధ్రదేశంలో రైతు వుద్యమానికి పునాదివేస్తూ పోయాడు. కాని క్షయవ్యాధికి గురిఅయ్యాడు. అతని చుట్టూ నున్న కామ్రేడ్సు తీసుకున్న జాగ్రత్త, ప్రేమలవల్ల అతని జీవితం కాపాడబడింది. రైతులకోసం ఈ మహాసభ నిర్వహణలో మళ్ళా తన జీవితాన్ని ఒడ్డాడు. అసలే బక్కచిక్కిన శరీరానికి మరింత శ్రమ కల్గించుతున్నాడు. ఏడాక్టరూ ఇంతటి శ్రమ చేయడానికి అతనికి పర్మిషన్ ఇవ్వజాలడు. అతని చూపులలో వినయం ఉట్టిపడుతుంది. అతడు చేసే నిర్ణయాలు ఎప్పుడూ మంచి తెలివితేటలతో కూడినవని కామ్రేడ్సు కందరికీ తెలుసు.

వలంటీర్లందరూ దాదాపు 16, 20 ఏండ్లవాళ్ళు. వాళ్లనాయకులు 30 ఏళ్ల లోపువాళ్ళు. తమ నాయకత్వం క్రింద వున్న వలంటీర్లలాగానే ఈ నాయకులూ రైతుకుటుంబాలకు చెందినవాళ్లే! వయస్సులో పిన్నలయినా, వీరే రైతు ఉద్యమ స్థాపకులూ, నిర్మాతలూ కూడాను. వారికి సంఘటితపరిచే శక్తి ఎంతవుందో, రైతాంగం మీద వారికెంత పలుకుబడి వుందో మహాసభయే తెలియపరచింది.

వలంటీర్లు చీమలబారులాగా పనిచేశారు. నేను 9 వ తేదీన మహాసభాస్థలానికి చేరినప్పుడు అదంతా అస్తిపంజరంలాగావుంది. కాని 13 వ తేదీకి అంతా పూర్తయి మహాసందడిగావుంది. 14 వ తేదీ కంతా పూర్తయి, సభకు వస్తున్న రైతాంగ మహాజనానికి స్వాగతమిస్తోంది.

## కాట్రగడ్డవారు

మహాసభాస్థలానికి కొద్దిదూరంలో ప్రతినిధుల బస ఏర్పరచబడింది. ఆబస కాట్రగడ్డ సోదరుల ఆవరణలో ఉంది. కాట్రగడ్డవారి కుటుంబం ఆగ్రామంలో ధనిక కుటుంబం; జిల్లాలో మంచి వ్యవసాయదారులని వారు పేరుపడ్డందుకు తాముగర్వ పడుతుంటారు.

వ్యవసాయంలో అన్నిరకాలుగా మార్పులను తీసుకురావడంలో వారు ప్రథములు. వర్జీనియా పుగాకును పండించుటలో ఎంతో నిపుణులు.

ఆ కుటుంబం ఉపహరించదగిన దేశభక్తకుటుంబం. కొట్రగడ్డ సోదరులలో అన్నిరకాల దేశభక్తులూ ఉన్నారు. ఆరవవాడైన నారాయణరావు కాంగ్రెస్ యం. యల్. ఏ ; అతను బెనారస్‌లో చదువుతున్న రోజులనుండి కమ్యూనిస్టులకు దిట్టమైన సానుభూతిపరుడు.

ఈ కుటుంబం అంతా ప్రతినిధులకు ఆతిధ్యమిచ్చారు. 400 మంది ప్రతినిధులకు ఎట్టి ఇబ్బందిలేకుండా చేయడమేగాదు. ఆ ప్రతినిధుల దైనందిన కార్యక్రమాన్ని కూడ చక్కని సుశిక్షణలో వుంచారు. ఇది ఒక పల్లెటూరిలో సాధ్యమవుతుందని నేను తలచలేదు. ఒత్తిడీలేదు, రద్దిడీలేదు. భోజనాలు, అనవసర ఖర్చులయ్యే విందులాగా తయారుకాలేదు. కాని, బాగాను, ఆరోగ్యకరంగాను వున్నాయి. ప్రతివానికి బెంగాల్ జ్ఞప్తికివచ్చింది. వాదవివాదాలకు, ఛలోక్తులకు దారితీసింది.

ఎవరో ఒకరు "ధనిక రైతులకు మాత్రం ఇలాంటి భోజనం ఎలా దొరుకుతుంది?" అంటూ చర్చ మొదలెట్టేవాళ్ళు బెంగాల్ కామ్రేడ్ జవాబిచ్చేవాడు: "ఎక్కువ పండే జిల్లా; అందులోను రైత్వారీ ప్రదేశం ! వెంటనే మరొక రాష్ట్రం ప్రతినిధి అందుకొని "అదికాదు; తిండి దొంగలను నెత్తికెక్కించు కొనడంలేదు ఆంధ్రలో" అంటూ జవాబు చెప్పాడు. ఇక తలా ఒకమాట అందుకొనేవారు. ఛలోక్తులు వరుసగా ప్రారంభమయ్యేవి.

తమ తమ ప్రాంతాలలో ఉన్నప్పుడు కంటె గూడా ఇక్కడే ప్రతి నిధుల దైనందిన జీవితం చక్కని కట్టుబాటులతో సకాలంలో జరిగింది. ఈ విషయం ప్రతినిధులు గుర్తించారు. మహాసభ చర్చలలో పాల్గొనడంతో పాటు చక్కగా భోంచేసే వీలు, సుఖంగా నిద్రపోయే అదునూ లభించింది. సెంట్రల్ కిసాన్ మీటింగు మార్చి 9వ తేదీన ప్రారంభమయింది. ఆలిండియా కిసాన్ కమిటీ 12వ తేదీన ప్రారంభమయింది. ఎక్కువ అనుభవం గల్గి ముందుకుపోయిన ప్రతినిధులు మాత్రం వివిధ రాష్ట్రాలలోని రైతుఉద్యమ అనుభవాలను సేకరించుతూ. తమ విశ్రాంతి కాలాన్ని గడిపారు. కాని తక్కిన వారందరికీ ఆంధ్ర కామ్రేడ్సునుజూచి ఉప్పొంగిపోవడంతోనే సరిపోయింది.

మహాసభ ఇంకా నాల్గురోజులుందనగానే మేమక్కడికి చేరాం. వలంటీర్లు ఎంతో వేగంగాను, పట్టుదలతోను పనిచేస్తున్నారు. బందోబస్తు విషయంలో ఎలాంటి కంప్లయింట్లు వుండటానికి వీలుండదని వాళ్ళు చేస్తున్నపనినిబట్టే తెలిసిపోయింది.

ఇక రైతులవిషయంచూద్దాం. సభకు ఎంతమందివస్తారు? స్థానికకామ్రేడ్స్ అంతా 50 వేలకు తక్కువరారని, ఇంకా ఎక్కువేవస్తారని ఖచ్చితంగా చెబుతున్నారు.

సోదర కాంగ్రెసు పెద్దలంతా ప్రజలు నిస్పృహచెందియున్నారని అంటుంటే, 50 వేలు ప్రజలు రావడం గొప్ప ప్రజాసమీకరణే,అవుతుంది. కాని నేను ధృవపరచుకోదలిచాను.

ఒకప్రక్క ఎన్నికగన్న రాష్ట్ర కాంగ్రెసు నాయకులే మన పాలసీ ప్రభుత్వానికి సహాయంచేస్తుందని చెబుతూంటే, 50 వేల ప్రజలను మీరెలాతీసుకురాగలరు? అని నేను ఆర్గనైజర్లను ప్రశ్నించాను.

రైతుకు తన పొలంవిషయం ఎంతబాగా తెలుసో, అలాగే ప్రజలసంగతీ, తమశక్తిసంగతీ ఆర్గనైజర్లకు బాగా తెలుసు. వారిలాజవాబు చెప్పారు.

## కాంగ్రెసులో పుట్టిపెరిగాం

"మేం కాంగ్రెసు ఉద్యమంలో పుట్టిపెరిగాం. గ్రామాలలో కాంగ్రెసు సంఘాలను నిర్మించిందిమేము. కమ్యూనిస్టులమయినంతమాత్రాన ప్రజల దృష్టిలో కాంగ్రెసువారిగా గాకుండపోలేదు. ఎందువల్లనంటే పార్టీ మమ్మల్ని మంచి ఆర్గనైజర్లనుగా తయారుచేసింది. జాతీయోద్యమానికి మరింత బలం చేకూర్చడానికిగాను, మేంరైతుసంఘాలలో రైతులను సంఘటితపరిచాం. మేం గ్రామాలలో దేశభక్తిని రగుల్కొల్పాం. గత 8 సంవత్సరాలనుండీ రైతుల హక్కులకోసం పోరాడుతున్నాం. తమ రైతుసంఘాలలోగాని, పార్టీయందుకాని భక్తివిశ్వాసాలు రైతుకు నశించవు. అలా నశింపజేయగలదేదీలేదు. రైతుసంఘాలనుండీ, కమ్యూనిస్టుపార్టీనుండి వచ్చినవారే నేడు ఈ మహాసభను ఆర్గనైజుచేస్తున్నారని ,వారికి తెలుసు. మేమంతా రైతుపుత్రులం. తమ బిడ్డల పార్టీగా పార్టీని రైతాంగ ప్రజలు చూస్తున్నారు."

పార్టీపై వేసే నిందలను నమ్మాలంటే రైతులు తమ బిడ్డలను ముందు తాము దూరం చేయాలి!

తమ పూర్వకార్యకలాపాన్ని గురించి వారు ఊరికే పొగుడుతున్నారని మనం భావించకూడదు. ఇప్పుడు చేసిన కృషిని గూడ గమనించుదాం. 450 దళాలు (ఒక్కొక్క దళానికి 5 గురు ఉంటారు.) 2 వేల గ్రామాలు తిరిగి ప్రచారంచేశాము. వేలకొలది సభకు వస్తారనడానికి ఇదేచాలు. గ్రామాలనుండి వచ్చిన వలంటీర్లు, మహాసభ యెడల ప్రజలు చూపిన ఉత్సాహాన్ని గురించి చెప్పసాగారు.

గ్రామాలలో రైతు ప్రభలు ఊరేగాయి. బాలసంఘాలు ప్రభాతభేరీలు జరిపారు. రైతుమహాసభ నినాదాలను స్త్రీలు తమ ఇండ్లముందు ముగ్గులతో చిత్రించారు. ఆ ముగ్గులలో సుత్తికొడవలి లేక నాగలి వేసేవారు. రైతుమహాసభ తేదీని ప్రాముఖ్యముగా ప్రదర్శించేవారు. ఇంకా రైతుమహాసభకు సంబంధించిన నినాదాలనుకూడ ముగ్గులుగా వేసేవారు. ఇలా స్త్రీలు, పిల్లలు సైతం ఉత్సాహభరితులవుతూంటే, రైతుమహాసభ దిగ్విజయ మవుతుందనడానికి సందేహంలేదు.

## విచ్ఛిన్నకులు విఫలులయ్యారు

రంగాముఠా పోటీమహాసభ జరుపుతామని ప్రకటించారు గదా. అది రైతులలో గందరగోళం కల్గించదా అని నేనడిగాను జవాబుగా నాకొక కథ చెప్ప బడ్డింది. పోటీ రైతుమహాసభ ఆహ్వానసంఘ కార్యదర్శిది కూడా కామ్రేడ్ వాసు గ్రామమే (భట్లపెనుమర్రు) వాసు ఆగ్రామంలో లేకపోయినా, అచటి స్థానిక కామ్రేడ్సు 2600 రూపాయలు మన సభకు వసూలు చేశారు. కాని పోటీ సభ ఆహ్వానకార్యదర్శి ఆ గ్రామంలో ఉండికూడా ఏమీ పోగు చేయలేక పోయాడు. మన దళాల ప్రచారానికి రైతులుత్సాహం జూపడం చూచి రంగాముఠా వదంతులు ప్రారంభించారు.

"బెజవాడ వెళ్లవద్దు; జపానువాళ్ళు ఎంతో దూరంలో లేరు: అండమానులోనే ఉన్నారు; జపానుకు వ్యతిరేకంగా మీరు ప్రదర్శనాలు చేస్తుంటే వాళ్ళు ఊరుకుంటారా? వాళ్లవిమానాలు మీమీద బాంబులు వేస్తాయి". ఇదీ రంగాముఠా ప్రచారం.

ఇంకా వెనుకబడ్డగ్రామాలలో మరోరకమైన ప్రచారం సాగించారు.

"బెజవాడ నిండా సాయుధమైన పోలీసులున్నారు. సభకు వచ్చేవాళ్లపైన కాల్చమని వాళ్లకి ఆర్డర్లున్నాయి; సభను ఇదివరకే నిషేధించారు. రైల్వేవాళ్లను టిక్కెట్లు ఇవ్వవద్దని ఆజ్ఞాపించారు."

ప్రయాణీకులపై రైల్వేవారు విధించిన నిషేధాన్ని పంచమాంగదళం ఈ విధంగా ఉపయోగించుకుంది.

విజయవంతంగా అఖిలభారత కిసాన్‌సభ జరిగి తే రైతులలో కమ్యూనిస్టుల పలుకుబడి హెచ్చిపోతుందని పోలీసులు భయపడిపోయారు. చిన్నచిన్న పోలీసు ఉద్యోగులు క్రిందిపిధంగా ప్రచారం చేశారు.

"బెజవాడ వెళ్లడం కష్టాలు నెత్తిన తెచ్చిపెట్టుకోడమే. అక్కడ దెబ్బలాట తప్పదు, కాల్పులు తప్పవు." వాళ్ళు జపాను ఏజంట్లు కానీయండి, బ్రిటిషువాళ్ళ

నౌకర్లుకానీయండి.- వాళ్ళు చేయగల్గిందల్లా పిరికితనాన్ని నూరిపోయజూడటం. వాళ్ళకి మిగిలిన ఆయుధమల్లా ఒకటే. అది వదంతుల వ్యాపింపజేసి, పిరికిమందు నూరిపోయడం; ఆవిధంగా ప్రజాఉద్యమాన్ని భగ్నంచేయడం.

ఈరకమైన ప్రచారం చివర నాల్గురోజుల్లో జరిగింది. ఆర్గనైజర్లు విస్తుపోయారు. ఈ వదంతులు ఎంత నష్టంకలుగచేస్తాయో వారు చెప్పలేక పోయారు.

విచ్ఛిన్నకులీవిధంగా ప్రయత్నించడం నాకు నవ్వుకల్గించింది. "బ్రిటిషువాళ్ళ ఏజంట్లు చెప్పేమాటలను వినడానికి పోకండి" అంటూ మొదలెట్టి "జపాను బాంబులకు, బ్రిటిషు తుపాకులకు ఎరగాకండి" అంటూ వాళ్ళు ముగించారు. రంగాముఠా, దేశభక్తులయిన రైతులముందు రాజకీయంగా ఆత్మహత్యగావించుకొందని భావించాను. బెజవాడ మహాసభకువచ్చే రైతులకోసం నిరీక్షించుతున్నాను.

## రైతుమహాప్రవాహం

13వ తేదీ రాత్రి చాల ప్రొద్దుపొయ్యేవరకు పనిచేయవలసివచ్చింది. ఆ మరునాడే మహాసభ. అర్ధరాత్రినుండీ ప్రశాంతవాయువును భేదించుకుంటూ నినాదాలు వినపడసాగాయి. వలంటీర్లింకా నిద్రపోలేదేమని నేనడిగాను. వాళ్ళు వలంటీర్లుకాదు; మహాసభకు వస్తున్న రైతులు అంటూ జవాబువచ్చింది. ఆరాత్రంతా ఆకోలాహలం తగ్గనేలేదు. ఎడ్లబండ్ల రణగొణధ్వని వినపడుతూంది. (ఆంధ్రుల బళ్లకు పెద్దపెద్ద చక్రాలుంటాయి. నేనింత పెద్దచక్రాలను మరెక్కడా చూడలేదు.) అంతూపొంతులేని రణగొణధ్వని, స్త్రీల విచిత్ర మధురస్వనాలు, పిల్లల ఏడ్పులు, సమిష్టిగానాలు - ఒకటేమిటి, అదొక మహాకోలాహలం! ఒక సైకిల్ వేసికొని మహాసముద్రంలా వచ్చిపడుతున్న రైతాంగజనాన్ని చూడటానికి కొద్ది మైళ్ళు పోయివద్దామనుకున్నాను. కాని చేతిలో పని వదలిపెట్టడానికి వీలయిందికాదు.

మరుసటిదినం ఊరేగింపులో పాల్గొనేదానికి, నన్ను నిద్రలేపేసరికి, నేనింకో ప్రదేశంలో ఉన్నానా అనిపించింది. మునపటిలా విశాలమైన బయళ్ళు ఖాళీగాలేవు. అది ఒక్కసారి రైతునగర్ అయిపోయింది. ఆనగర్అంతా రైతులమయం అయింది. అన్నిరోడ్లనుండి ఎడ్లబళ్లతో అంతులేకండా వచ్చిపడుతున్నారు రైతులు. అటూ ఇటూ చూడటానికి నాకవకాశం లేదిక. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. ఊరేగింపును బాగాచూడటానికి, కొన్ని ఫోటోలు తీసుకోడానికి, అనువైన స్థలంకోసం పరుగెత్తవలసివుంది.

నేనొక హాస్పిటల్ గోడ ఎక్కి ఊరేగింపు చూస్తున్నా. ఊరేగింపు తిన్నగా రోడ్డునవచ్చి కాలువబ్రిడ్జి దాటి కాలువ ప్రక్కగాఉన్న రోడ్డు వెంటబడి చివరకు ఒక రైల్వే బ్రిడ్జి క్రిందుగా పోతోంది.

## మరపురాని ఊరేగింపు

అది ఒక బ్రహ్మాండమైన దృశ్యం. ఊరేగుతున్న ప్రజల పాదాలవల్ల రేగిన ధూళివల్ల, దూరానికి మనుష్యుల్ని గుర్తించడం అసాధ్యమౌతోంది. దట్టంగా ఎర్రజెండాలతో నిండివున్న ఆ పెద్ద వూరేగింపు కదలిపోతూఉంటే, ఎర్రజెండాల మహాప్రవాహంలాగ కనుపించింది.

మంచి సుశిక్షణతో నడిపించిన ఈ 20 వేలమంది ఊరేగింపును గూర్చి పలువురు పలుఅభిప్రాయాలను, తమ అనుమానాలను జోడించి ఇవ్వసాగారు.

కొందరు పల్లెటూరి యువకులు ఇలా అనుకొంటున్నారు.

"మాస్కోలో రెడ్‌స్క్వేర్‌లో రెడ్ఆర్మీ ప్రదర్శనం బహుశా ఇలాగే ఉంటుంది." ఇలా అన్నకుర్రాళ్ల అమాయికత్వాన్ని జూచి మనం గేలిచేయరాదు. వాళ్ళు చెప్పినదానిలో కొంత అర్థంవుంది. రెడ్ఆర్మీని సృష్టించేదశకు రష్యన్ ప్రజలు వెళ్లగలిగారు; నేడు ఆంధ్ర రైతాంగం ఈ వలంటీర్లను తయారుచేసే దశకు వచ్చింది. రెండింటిలోను స్పిరిట్ ఒకటే!

ఊరేగింపును జూచి బెజవాడ పట్టణవాసులు దిగ్భ్రమ చెందారు. కొందరు కాంగ్రెసు మహాసభ ఊరేగింపులతో పోల్చారు. కొందరిది వాటికంటె కూడా బాగా అర్గనైజు జేయబడిందన్నారు. ఇది వారి కనులకు మిరుమిట్లు కొల్పింది. చాలా మందికి ఇంత బ్రహ్మాండమైన ప్రజాసమీకరణ ఎలాసాధ్యమయిందో అర్థంకాలేదు. తెలుగు దినపత్రికలు దుష్ప్రచారం చేసి వాళ్ళమనస్సులు విరిచాయి. రంగా నిజమైన రైతునాయకుడని, ప్రభుత్వ సహాయంతో కమ్యూనిస్టులు అల్లరీఆగం చేస్తున్నారనీ, అవి వ్రాశాయి. ఆ పత్రికా పాఠకులే నేడు తాము ఎన్నడూ చూడనంత బ్రహ్మాండమైన ఊరేగింపును జూచి విస్మయం జెందారు. ప్రభుత్వపు ఏజంట్లు గనుక అయితే అంత బ్రహ్మాండంగా ప్రజలను ఎలా సమీకరించ గలిగేవాళ్ళు? అంత దేశభక్తిని ఎలారగుల్కొల్ప గలిగారు? అని వాళ్ళు ఆలోచనలో పడ్డారు. వాళ్ళకళ్ళముందు ఒక నూతన వాస్తవికత కన్పడసాగింది. అందుచే ఆశ్చర్య నిమగ్నులయిన వారి ముఖాలలో భ్రాంతృభావం కన్పించడం లేదు.

## సైనికులు బహుమానాలు కురిపించారు

పట్టణంలోని మధ్యతరగతి విద్యాధికులంతా రైతుసంఘంఅంటే (Noism) పల్లెటూరి యువకులని తలిచారు. కాని ఇపుడు ఊరేగింపును రైతు ప్రవాహం అని వర్ణించసాగారు. మరపురాని, రైతుల దేశభక్తి ప్రదర్శనాన్ని చూచాక వారు తిరిగి ఆలోచించ సాగారు.

8A



రైతుమహాసభలో ఒకదృశ్యము

కార్మికవర్గ ప్రదేశాలలో ఊరేగింపుకు ఉప్పొంగిపోయి కార్మికులు అభివందనాలు చేసేవారు.

ముస్లింప్రదేశంలో "కాంగ్రెస్ - లీగులు ఏకంకావాలి" అన్ననినాదంవిని తలలూపుతూ మందహాసంచేసేవారు.

బాగా బలిసిన ప్రభుత్వపు నౌకరు ఒకడు తన వాకిటముందు నిలబడి కోపం వెళ్ళగ్రక్కసాగాడు. "ఈ రైతులంతా గాడిదలు; ఇన్నివేలమందిని ఎవళ్ళు తీసుకువచ్చారిక్కడికి ? వాళ్ళంతా కలరావ్యాపింపజేస్తారు. ముందు కలరా వాళ్ళనే పొట్టబెట్టుకుంటే బాగుండును."

ఇతనికి వెంటనే సమాధానమిచ్చింది చీపురుపట్టుకొనిఉన్న ఒక స్త్రీ. బహూశా అతని పనిమనిషే అయివుండవచ్చు. "ఎందుకండీ అలా తిడతారు ? వాళ్ళు మంచివాళ్ళు. ప్రజలకు తిండికావాలని వారు చెబుతున్నారు. మీరువినడంలేదూ ?"

నేనొక అద్భుతమైన ఘటనను చూడలేకపోయాను. ఊరేగింపు రైలుబిడ్జి క్రిందకువచ్చినప్పుడు, పైగుండా ఒక మిలటరీబండి పోతోంది. దానిలో మన దేశంవాళ్ళూ, ఇంగ్లీషువాళ్ళూ సైనికులున్నారు. వాళ్లలో చాలమంది చేతులూపారు. కొందరు కమ్యూనిస్టు ప్రణామం చేస్తూ పిడికిలి బిగించారు. సోదరభారతీయ సైనికులు సంతోషాతిశయంతో సిగరెట్లు, బిస్కెటు పొట్లాలూ కురిపించసాగారు. ఊరేగింపులోని వారంతా మరింత బిగ్గరగా జయజయ ధ్వానాలు చేయసాగారు. సైనికులకూ, ప్రజలకూ ఉండే భవిష్యత్ సామరస్యానికి ఇది ఒక నమూనా. ఒక రెడ్ వలంటీరు ఒక బిస్కటును నాకు చూపాడు. దానిని ఈఘటనా స్మృతిచిహ్నంగా దాచిపెట్టుకొంటానన్నాడు.

## మహాసభ ప్రారంభం

మహాసభ 14 వ తేదీ సాయంత్రం ప్రారంభమైంది. పెండాల్‌లోకి ప్రవేశించడం, 8 అడుగుల ఎత్తున ఉన్న వెదికనెక్కి చుట్టూనున్న ప్రజాబాహుళ్యాన్ని చూడటం - అదంతా ఒక మరుపురాని గొప్ప అనుభవం.

నేనెప్పుడూ అంతమంది జనాన్ని కాంగ్రెసు మహాసభలో తప్ప ఎక్కడా చూడలేదు. ఆరోజు ఎన్నడూలేనంతబలం నాలో కన్పించింది. ఒక్క మాపార్టీయే ఇంతచేయగల్గిందే ! అన్నిపార్టీలు ఐక్యమై పనిచేస్తే దేశం ఎందుకు సర్వనాశనం అవుతుంది ?

రైతుయొక్క దేశభక్తిపూరిత కర్తవ్యమేమిటో అతనికి తెలియజేసిననాడు, తన కోర్కెలను సాధించడానికి రైతుసంఘాలలో అతనిని సంఘటితపరచిననాడు-

దేశమిచ్చే సందేశాన్ని నిర్వర్తించడంలో అతడు వెనుదీయడు. అలా మేంచేశాం. అందుచేతనే, మన పాలసీ సరియైనదని రైతుతెలియజేస్తున్నాడు; రైతుసంఘాలలో తన విశ్వాసాన్ని రైతు ప్రదర్శించుతున్నాడు; దేశవ్యాపితమైన తన రైతుసంఘ మహానాయకుల దేశభక్తిసందేశాన్ని వినడానికి తయారై రైతువచ్చాడు.

అది ఒక బ్రహ్మాండమైన ప్రజాసమూహంమేమాత్రంగాదు, చక్కని కట్టుబాటుతో ప్రవర్తించిన జనసామాన్యంమాత్రమేగాదు, తీవ్రంగా రాజకీయ ఆసక్తిగల జనసముదాయంఅది - అని మామూలు ప్రేక్షకుడునైతం చెప్పగలడు. రైతాంగ జనం దేశభక్తితోగూడిన మహాసభ తిరునాళ్ళకువచ్చారు.

పందిళ్ళలో జనసామాన్యమంతా మునిగిపోలేదు. పైగా ఆజనసామాన్య గంభీరతను మరింత వెల్లడిచేసింది. పందిళ్ళకు పాతిన ఆసన్నటి వెదురువాసాలు, మంచి ఎముకపుష్టితో నిండిన ఆంధ్రరైతులముందు పేలవంగా నిలబడిపోయాయి. నిగనిగలాడే రైతుల నల్లటి శరీరాలకు బాక్‌గ్రౌండ్‌గా అఎండు తాటాకులు బూడిదరంగువన్నె తెస్తోంది.

## వేలకొలది స్త్రీలు కనులపండువుగా వచ్చారు

స్త్రీ సముదాయమున్న దృశ్యం అన్నిటికన్నా బాగావుంది. స్త్రీలు చినిగిపోయిన పీలికలతో రాలేదు. తమకున్నవాటిలోనుంచి మంచిదుస్తులుధరించివచ్చారు. వారు అన్నివర్గాలనుండి వచ్చారు. అన్నివయస్సులవారూ ఉన్నారు. వారిరూపురేఖలుచూద్దాం. అందులో అందమైనవర్గం నుండి నిగనిగలాడే నలుపురంగువాళ్ళ వరకూ ఉన్నారు. ఎక్కువమంది నలుపురంగువాళ్ళే! అప్పుడే శుభ్రంగా ఉతికిన వారి చీరలు కన్నులపండువుగా ఉన్నాయి. బాగా మెరిసే ముతకరంగులే వీరెక్కువ వాడతారు చీరలకు.

కాంగ్రెసు మహాసభలకువచ్చే స్త్రీలకంటె ఎక్కువమంది వచ్చారని ప్రతివారూ అన్నారు. స్త్రీలకుప్రత్యేకంగా విభజించినస్థలం, మొత్తంస్థలంలో 5 వ వంతని ఆర్గనైజర్లు చెప్పారు. వచ్చిన స్త్రీలంతా కిక్కిరిసికూర్చున్నారు. దాదాపు 20 వేల మంది స్త్రీలున్నారు.

నేను దగ్గరగాపోయి చూద్దామనుకొన్నాను. ఒకసారి వారున్నస్థలంచుట్టూ ప్రదక్షిణంచేశాను. సామాన్యంగా స్త్రీలు సమావేశమయ్యేచోట పిల్లలు మహా అల్లరిచేస్తారు. కాని ఇక్కడ అంతగా శబ్దమేలేదు.

ఈ పిల్లల విషయమై సుందరయ్య ఇదివరకే ఆలోచించాడు. "ఒకవెయ్యి బిస్కటు పొట్లాలను వలంటీర్లదగ్గరవుంచండి - ఒక్క బిడ్డ అరిస్తే ఒట్టు" అని

అన్నాడు. అలాగే బిస్కట్లు పంచిపెట్టారు. నేనొక పిల్లతల్లిని కలిసికొన్నాను. ఆమె ఇకా చిన్నవయస్కురాలే. ఆమెబిడ్డ బిస్కత్తు హుషారుగా నములుతోంది. ఆమెనొక ప్రశ్న వేశాను. "మీ స్త్రీలను గురించీ, మీసమస్యలనుగురించీ (బిడ్డవంక చూపించాను - అంటే పిల్లల్నిగురించీ) మేం తప్ప ఏ ఇతర సంస్థఅయినా పట్టించుకొంటున్నదా ?" దానికి జవాబుగా, "లేదు - మీరే" అన్నట్లుగా సంతోషాతిశయాన్ని వెలిబుచ్చుతూ ఒక్కనవ్వునవ్వింది.

మరొకచోట, కొంతమంది ముసలాళ్ళను చుట్టూకూర్చోబెట్టుకొని ఒక ముసలావిడ కూర్చొని సగర్వంగా ఏదోకబుర్లు చెబుతోంది. ఆమెమాటలు వినాలని అక్కడికివెళ్ళాను. ఆ వింటున్నవాళ్ళందరూ ఆమె బంధువులు. తనకోడలు, మనమరాలు వలంటీర్లుగా పనిచేస్తున్నారని వాళ్ళకి చూపించుతోంది. ఆనందంతో ఉబ్బిపోతూ, వాళ్ళు గ్రామాలలో యేమిచేస్తున్నారో చెబుతోంది. పాయిఖానాదొడ్లకోసం చేసేకృషి ముసలాళ్ల చిన్నపిల్లల్ని పెళ్ళిచేసికోడాన్ని ఆపివేయడం - మొదలైన విషయాలను ఒక్కొక్కటి కథలుగాచెబుతోంది.

ఇంతబ్రహ్మాండగా మహిళలు ఎందుకు పోగయ్యారో ఇపుడునాకు అర్థమయింది. 250 మంది పార్టీసభ్యులు స్త్రీలలో వున్నారు. వీరంతా దాదాపు రైతు కుటుంబాలనుండి వచ్చినవారే! మహిళాసంఘాలలో 20 వేల మందిని చేర్పించారు. మహిళాసంఘాలలో చేరినవారుకూడా ఎక్కువమంది రైతుస్త్రీలే. ఈ మహిళా వర్కర్సు వెనుకబడ్డ గ్రామాలలో పనిచేసినఫలితంగా, మూలనున్న ముసలమ్మలలో సైతం దేశభక్తి రేకెత్తింది.

## లక్షమంది ప్రజలు

ఈ ప్రజాసమూహాన్నంతా చూచేసరికి నా ఛాతీ కొంచెం ముందుకుబికింది. ఈ ముసలమ్మ చెప్పే వార్తలు వినేసరికి నావెన్ను కొంచెం నిటారుగా నిలిచింది. మహాసభకు హాజరైన ప్రజల సంఖ్యను ఇతరులు సరిపోల్చుకోడానికి గాను, నేను నెమ్మదిగా అక్కడినుండి జారాను. అప్పుడే ఈ విషయం ప్రతినిధులలోను, వేదికపైనా చర్చకు రానేవచ్చింది. లక్ష మొదలు 2 లక్షల దాకా అంచనావేశారు. అందరిలోకి మరీ పీనాసిగా లెక్కవేసింది సుందరయ్య. రైతునగర్ ఆవరణలో 60 వేలమందీ బయట 30 వేలమందీ ఉంటారని అతని అంచనా. అందరి అంచనాలు విన్నాను. అంతకన్నా నేను చేసేది యేమీలేదు. నేనేం ఈ లెక్కలలో పండితుణ్ణిగాదు. అయినా వివిధ మహాసభలను జూచిన అనుభవాన్ని బట్టి వీరు ఒక లక్షమంది ఉంటారని నేను అంచనా వేశాను. ఇది యెక్కువ అంచనా అని ఎవరూ అనజాలరని నాకు ఆత్మవిశ్వాసం వుంది.

మహాసభను వదలి ఏర్పాట్లు ఎలావున్నాయో చూద్దామని వెళ్ళాను. ఆరోజు ఒత్తిడికి ఆహ్వానసంఘపు ఏర్పాట్లు తాళాయో లేదో చూద్దామని వెళ్లాను. రోజూ యీవిషయమై చూస్తూందేవాణ్ణి. ఎందువల్లనంటే మన వర్కర్ల నిర్మాణసామర్థ్యం అంతా దీనిలోనే వుంది.

## ఆరోగ్యపు ఏర్పాట్లు - నీరు - పరిశుభ్రత

నీళ్ళ ఏర్పాట్ల గురించి ఆరోగ్యవసతుల గురించి సుందరయ్య గర్వపడుతుండేవాడు.

లక్ష గాలన్ల నీరు పట్టే 15 సిమెంటు కుండ్లు కట్టించబడ్డాయి. ఇందులోని నీరు మంచినీళ్ళకు, నిప్పు నార్పడానికి, ఇతర ఉపయోగాలకుగాను సిద్ధం చేయబడింది. నీటిని క్లోరినేట్ చేశారు. (మందు కలిపారు) మోతాదు ఎక్కువయింది. రైతులు కొద్దిగా వాసనగా ఉన్నాయని కంప్లెయింటు చేస్తే వెంటనే వలంటీర్లు డాక్టర్లను పట్టుకున్నారు. డాక్టర్లు, కొద్దిగా విరోచనాలైనా ఈ నీరు త్రాగడంవల్ల కలరా రాకుండా గ్యారంటీ ఉంటుందని రైతులకు నచ్చజెప్పారు. మొగలా్రజపురం భావినుండి 15 ఎడ్ల బండ్లు నిత్యమూ పీపాలతో నీళ్ల మోసేవి.

వలంటీర్లు ఈ నీటిని 4 వేల కుండల్లో నింపేవారు. మరో 4 వేలముంతలతో దాహమయినవాళ్ళకి నీళ్లందిచ్చేవారు.

మొదటిరోజు ఎండ తీక్షణతవల్ల కుండల్లో నీరంతా ఖాళీఅయింది. ఇంకా నీళ్ళు కావాలని ప్రజలడుగుతుంటే వలంటీర్లు పీపాలు తక్కువవడంవల్ల నీళ్ళు లేవని తెలియజెప్పారు. "పీపాలకోసం మాకు ఖబురుచేస్తే మేం మా గ్రామాల నుండి ఇంకా కొన్ని పంపేవాళ్ళం కదా!" అని జవాబు.

మరుసటిరోజున ఎక్కువ నీరు పందిరికో. నిలవ ఉంచబడింది.

2000 గోతులు తవ్వారు. పాయిఖానా దొడ్లలో ఎప్పుడూ మట్టి, పారలు సిద్ధంగా ఉండేవి. కడపరాళ్ళతో మూత్రవిసర్జనానికి 100 దొడ్లు కట్టారు.

అన్నిటికన్నా ముఖ్యవిషయం. రైతులు బహిరంగ ప్రదేశాన్ని మల మూత్రాదులకు ఉపయోగించకుండా వీటినే ఉపయోగించడం. రైతులకు ఎప్పుడూ గ్రామాలలో వాటి నుపయోగించే అలవాటు లేదు. వలంటీర్లు అన్నిచోట్లా ఉండేవారు. వాళ్ళని తప్పించుకోడం కష్టం. వలంటీర్లు నెమ్మదిగా ప్రజలను దొడ్లవైపుకు నడిపేవారు. నేను హరిపుర - త్రిపురీ కాంగ్రెస్సులకు వెళ్ళాను. అక్కడలాగా దగ్గరున్న ప్రదేశంలో చెడువాసన ఇక్కడ లేదు. వాసన రాకుండా జాగ్రత్త తీసుకోబడింది.

రాత్రింబవళ్ళు 50 మంది మునిసిపల్ పనివాళ్ళు వలంటీర్లుగా పనిచేశారు. వాళ్ళ యూనియన్ ఇందుకుగాను ఇక్కడికి పంపింది. ఆహ్వానసంఘం వాళ్ళకి కొత్తదుస్తులు సప్లయిచేసింది. బొక్కెనలు, పారలు మొదలైనవి - బెజవాడమునిసిపాలిటీ సైతం ఉపయోగించని పనిముట్లు- ఆహ్వానసంఘం సప్లయిచేసింది. ఇంకా బెజవాడ మునిసిపాలిటీ ఇంకా చీపుర్లు బుట్టలు మాత్రమే పాకీపనివాళ్ళకిస్తోంది. మునిసిపల్ కార్మికులంతా సమిష్టి భోజనశాలలో భోంచేసేవారు. ఒకరోజున సుందరయ్య కెదురుగా భోంచేస్తున్నారు. వారిని గురించి చెప్పకపోతే వారు మునిసిపల్ కార్మికులని నాకు తెలిసియుండేది కాదు. అంత శుభ్రంగా ఉన్నారు. రైతు వలంటీర్లు కూడా, ఆ మునిసిపల్ వలంటీర్లు అంతా ప్రత్యేకంగా ఒక దళంలో ఉన్నా తమ వలంటీర్లలాగానే చూశారు. ప్రత్యేకదళానికి అర్థం యేమిటని అడిగాను. వలంటీరు నాయకుడొకడు ఇలాచెప్పాడు. "ఒక్కొక్క ప్రత్యేకకార్యంలో ఒక్కొక్క పనిచేసే దళాలను ప్రత్యేకదళాలంటాము. ఉదాహరణకు హాస్పిటల్‌లో పనిచేసేది ఒక ప్రత్యేకదళం. అలాగే మునిసిపల్ వర్కర్ల దళం కూడా."

## ఆసుపత్రి

మహాసభలో ఏర్పాటుచేసిన ఆసుపత్రి నిజంగా చాల గొప్పది. అవడానికి అన్ని ఏర్పాట్లలాగే అదికూడా తాటాకుపాకే. ఆరెండురోజులలోను ఆసుపత్రిలో చేర్చుకోబడినవారుగాక, బైటవుంటూ మందులు తీసుకునేవారికి 5000 మందికి చికిత్స చేయబడింది. ఇక ఆసుపత్రిలో చికిత్సపొందిన కేసులలో రక్తవిరేచనాలు.నిమోనియా. మొదలైనవి, ఎముకలు విరిగినవికూడ వున్నాయి. సుందరయ్య తమ్ముడు డాక్టర్ రామ్ నాయకత్వంక్రింద 20 మంది డాక్టర్లు అహర్నిశాలు పనిచేశారు. వాళ్ళుచేసిన పనిచూస్తే నాకు అద్భుతమనిపించింది. ఎమర్జన్సీకోసం ఏర్పాటుచేసిన తాత్కాలిక ఆసుపత్రి, అందులోను. ఏదో ఆరోగ్యకారణాలుచెప్పి కాన్ఫరెన్సును జరగకుండా చేయాలని చూస్తున్న పేచీకోరు, హెల్తుఆఫీసరుగారి శల్యపరీక్షలన్నీదాటి, అంత తక్కువ ఖర్చుతో, అంత తక్కువ వ్యవధిలో అంత చక్కగా ఆర్గనైజుచేయగలిగారంటే నాకు ఆశ్చర్యంవేసింది. దీని రహస్యం ఏమిటి?

ఈ డాక్టరు కామ్రేడ్స్ తమ తలిదండ్రులైన రైతుల ఐశ్వర్య, ఆదరణలతో చక్కని ఆధునిక వైద్యవిద్యనభ్యసించారు. రెండోది కమ్యూనిజం వీరిలోవున్న దేశభక్తిని ప్రగాఢమొనర్చింది. తాము రైతుబిడ్డలమని, రైతుల క్షేమంకోసం పనిచేస్తూన్నామని గర్వపడేటట్లు చేసింది. ఇక మూడోది, పార్టీ వారికి డబ్బు చాలినా చాలకపోయినా, తమ బాధ్యతను కర్తవ్యాన్ని చక్కగా నెరవేర్చాలనేది నేర్పింది.

బెంగాలులో ప్రభుత్వం ఏర్పాటుచేసిన ఎమర్జన్సీ ఆసుపత్రులు చూచిన తరువాత, మన ఈ ఆసుపత్రి ఇంత చక్కగా అర్గనైజుచేయగలుగుతామని నేను కలలోనైనా అనుకోలేదు. ఇంత చక్కగా ఏర్పాటుచేయగలిగారు కనుకనే, రైతుమహాసభను చూడడానికి 60 మైళ్ళు నడిచివచ్చి, కాలుబెణికి ఆసుపత్రిలో పడుకున్న ముసలమ్మ డాక్టర్లను తనకొడుకుల్లాగ, నర్సులను చేతికందిన తన కూతుళ్లలాగ భావించి తన యింట్లోవున్నట్టుగానే కాలక్షేపంచేసింది.

## ఆరోగ్య ప్రదర్శనం

ప్రస్తుతపరిస్థితుల్లాంటి క్లిష్టపరిస్థితుల్లో, వూరికే రోగాలకు చికిత్ససంగతి మాత్రమే ఆలోచించడం చాల తప్పుఅని డాక్టర్ రామ్ సిద్ధాంతం. దేశాన్ని అంటువ్యాధులు ఆవరించే ప్రమాదంవున్నప్పుడు అవివ్యాపించకముందే వాటినిగురించి, అవిరాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి, ప్రజలకు చెప్పవలసిన బాధ్యత డాక్టర్లది. అందువల్ల అతనొక ఆరోగ్యప్రదర్శనాన్ని ఏర్పాటుచేశాడు. ఈప్రదర్శనం అన్నిటికన్నా ఎక్కువగా రైతులను ఆకర్షిస్తోందని అతను నాతో చెప్పాడు. నేను మొదట అది నమ్మలేదు. కాని తరువాత ఆ ప్రదర్శనందగ్గరేవుండి పనిచేసిన వాలంటీరు, డాక్టర్ రామ్ చెప్పినది నిజమేనని బలపరిచాడు.

ఈ ప్రదర్శనంలో మన శరీరం, దాని భాగాలు, వివిధరకాల అంటువ్యాధులను గురించి, రైతులు తమకున్న అవకాశాల్లో వాటిని ఎట్లా ఎదుర్కోవాలో మొదలైన చిత్రాలున్నాయి. అంతేకాదు. రైతులు తినే ఆహారంలో రకాలు, ఏది ఆరోగ్యకరమైన ఆహారమో తెలియజేసే చిత్రాలుకూడా వున్నాయి. పిల్లల పోషణను గురించి, ఆరోగ్యవంతులైన సోవియటు పిల్లల ఫొటోలుకూడా ప్రదర్శింపబడ్డాయి.

## ఇతర ప్రదర్శనాలు

బెంగాల్ ప్రదర్శనంలో సునీల్‌జానా తీసిన ఫొటోలు, చిత్తప్రసాద్ గీసిన చిత్రాలు, ప్రదర్శింపబడ్డాయి. ఈ చిత్రాలన్నీ వ్రాతలకంటె ఎన్నోరెట్లు ఎక్కువగా బెంగాల్ పరిస్థితిని తెలియజేస్తున్నాయి. ఈ చిత్రాలు చూచిన ప్రతివారూ వెళ్ళేటప్పుడు బెంగాల్ సహాయనిధికి పెట్టిన డబ్బీలో కానీయో దమ్మిడీయో ఎంతో కొంత పడవేయకుండా వెళ్లలేకపోయారు.

బొంబాయి సోవియట్ మిత్రమండలివారు సోవియట్ ప్రదర్శనానికి సోవియట్ చిత్రాలు పంపారు. వీటిలో సోవియట్ జీవితాన్ని ముఖ్యంగా సమిష్టివ్యవసాయ క్షేత్రంలో రైతుజీవితాన్ని తెలియజేసే ఫొటోలు, పోస్టర్లు, చార్టులు, మొదలైనవి చక్కగా ప్రదర్శించారు.

ప్రభుత్వ వ్యవసాయశాఖవారి సహాయంతో ఒక వ్యవసాయ ప్రదర్శనం కూడా ఏర్పాటు చేయబడింది. దీనిలో ఆధునిక వ్యవసాయిక పనిముట్లు, మంచి విత్తనాలు, ఎరువులు మొదలైనవి ప్రదర్శించబడ్డాయి. ఇవన్నీ రైతుకు ఎక్కువ పంట పండించడం, మంచి ఆహారధాన్యాలను పండించడం ఎలాగో తెలియ జేస్తున్నాయి.

మొత్తం 30 వేలకు పైగా ఈ ప్రదర్శనాలను చూచారు. మహాసభ కార్య క్రమంలో ఈ ప్రదర్శనాలు చూడడానికి చాలినంత అవకాశం లేకపోవంవల్ల చాల మంది చూడలేకపోయారు. కొంతమంది గ్రామపెద్దలు వచ్చి ఈ చిత్రాలను తమ గ్రామాలకు ఒకసారి పంపవలసిందని కూడ కోరారు.

## పశుప్రదర్శనం

పశుప్రదర్శన ప్రారంభోత్సవానికి 20 వేలమంది వచ్చారు. ఇటువంటి ప్రదర్శనాన్ని నేనిదివర కెన్నడూ చూడలేదు. అఖిలభారత రైతుమహాసభ తగపున పశుప్రదర్శనం అనేది యేర్పాటుచేయడంకూడా ఇదే ప్రథమం. ఎండ తీక్షణంగా కాస్తోంది. మూడు గంటలసేపు నేనక్కడే వున్నాను. ఇదంతా చూచిన తరువాత మన ఆంధ్ర కామ్రేడ్సు రైతులతో యెంత సన్నిహిత సంబంధం కలిగి వున్నదీ నాకు బోధపడింద.

ప్రదర్శనానికి అన్నిరకాల పశువులు వచ్చాయి. ఆబోతులు, దున్నపోతులు, పాడిఆవులు, గేదెలు, దూడలు, మంచి గిత్తలు, దుక్కిటెద్దు అనేకరకాలు వచ్చాయి. ధనిక రైతుల పశువులు వేరు చేయబడ్డాయి. ఎందుకంటే పశువులను బాగా మేపగల సామర్ధ్యం వారి కున్నంత మరెవరికీ వుండదు. ఎక్కువ బహుమతులు వారే కొట్టేయవచ్చును. అందుచేత అవి వేరుచేయబడ్డాయి. ఆ ప్రదర్శనంలో ధనిక రైతుల పశువులతోపాటు బీదరైతుల పశువులకు కూడా బహుమతులు వచ్చాయి. అంటే మంచి జాతిపశువులు రావాలంటే ధనికరైతులవద్ద నుంచే రావాలి. బీద రైతులవద్ద మంచిజాతిపశువు లుండవనే అపోహ దీనితో పోయింది. పంజాబు కామ్రేడ్సుకి ఒక గర్వం వుండేది. వాళ్ళ దేశంలోని పశువులలో సమానమైన పశువులు ఇంకెక్కడా వుండవని. కాని ఆంధ్ర పశుసంతతిని చూచిన తర్వాత ఇవి కూడ మంచిపశువులే అనేది వారంగీకరించక తప్పిందికాదు.

బహుమతులను వేటికివ్వాలో నిర్ణయించే జడ్జీలముందు పశువుల నన్నిటిని వరసలో నిలబెట్టారు. అందులో ఒక జత గిత్తలను పట్టుకుని నిలబడ్డ యువకు డొకడు మొదటి బహుమానం కొట్టాలని బహు ఉబలాటపడుతున్నాడు. అతని గిత్తలు ఏ ప్రదర్శనంలోనూ బహుమతి పొందకుండా రాలేదట. అతని కిప్పుడు

కావలసింది ఇక్కడ వచ్చే వెండికప్పుకాదట అఖిలభారత రైతుమహాసభలో తన జతకి బహుమానం వచ్చింది అనేదే అతనికి కావాలి. ఈ సభలో వచ్చిన బహుమతి ఇతర ప్రదర్శనాలలోని బహుమతుల లాంటిది కాదని ఆతని నమ్మకం. ఈ ప్రదర్శనంలో కనక బహుమతి వచ్చిందంటే ఇక చాలునట. ఇంక తన గిత్తలజతని ఏప్రదర్శనానికీ తీసుకువెళ్ళడట. గర్వంతో అతడీ మాటలు అంటూ వుంటే అతని ప్రక్కనేవున్న పెద్దరైతు "చాల్లేవోయ్ యింక వూరుకో. కాస్త ఓపిక పట్టు" అని గదమాయించాడు.

మంచి పశువుల్ని మేం ఫొటో తీసుకుంటూవుంటే ఓపికతో మేమెలా నుంచోమంటే అలా నుంచున్నారు. నా కంటె సునీల్ మంచి ఫొటోగ్రాఫరు అంటే వారికి ఆశ్చర్యం వేసింది. సునీల్‌కంటె నేనే పెద్దవాడినిగా కనుపిస్తున్నాను. పైగా నేను పార్టీనాయకుడ్ని; అందుచేత నేనే బాగా ఫొటోలు తీస్తానని వారి అభిప్రాయం కాబోలు! రైతులలో పెద్దవాడైతే వ్యవసాయంలో ఎక్కువ అనుభవం వున్నవాడయినట్లుగానే నేను కూడా మంచి ఫొటోగ్రాఫరునని వారనుకుని వుంటారు.

అంధ్రిలో దున్నలు, గేదెలు అంత మంచి సంతతి కాదు. కాని కాట్రగడ్డ వారిగేదెను బైటికి తీసుకువచ్చేసరికి అందరికీ ఆశ్చర్యం కలిగింది. బైటికి రాగానే ఆ నల్లటి చిన్నఏనుగులాంటి గేదె పరుగులు ప్రారంభించింది. వారి పశువులకాపే కుర్రాడు దాని మీద ఎక్కి కూర్చుని తిరుగుతూ వుంటే ప్రేక్షకుల ఆనందం చెప్పతరంకాదు, నవ్వనివారు లేరు.

కాట్రిగడ్డ సోదరులలో ఒకరైన భవాని ఈ పశుప్రదర్శనాని కంతకీ ఆర్గనైజరుగా పనిచేశాడు.

## వైజ్ఞానిక ప్రదర్శనాలు

అన్ని ప్రదర్శనాలలోకి బాగున్నది బెంగాలుదళంవారి ప్రదర్శనం. రెండు రోజులూకూడా ఈ వైజ్ఞానిక ప్రదర్శనాలు రాత్రి 10 గంటలకు ప్రారంభమయ్యేవి. తెల్లవారుఝామువరకూ వుండేవి. మహాసభకు వచ్చిన జనంలో చాలమంది వీటిని చూడడానికి వచ్చేవారు.

అక్కడకు వచ్చిన వారెవరూ ఇదంతా తమాషాగనకనే చూడడానికి వచ్చామని చెప్ప సాహసించలేరు. ఇది మామూలు తమాషాకాదు. ఇది దేశభక్తియుతమైన తమాషా. ఇదివరకు రైతులకు అలవాటైన పాత వైజ్ఞానికరూపాలను స్వీకరించి వాటిలో కొత్త సంగతులు జొప్పింపబడ్డాయి. రైతుకుటుంబంలో ముసలమ్మ మొదలు మునిమనమల వరకూ ప్రదర్శనాలు పూర్తిఅయ్యేవరకు కదలకుండా

కూర్చున్నారు. వారికదేమీ అర్థంకాకపోతే వారెందుకలా కూర్చోగలుగుతారు? ఈ వేషాలద్వారా చెప్పేదంతా వారు అర్థంచేసుకుంటూనే వున్నారు. ఇట్లా చెప్పిన విషయాలే రైతులకు బాగా అర్థమౌతాయి. కనుకనే మహాసభ ఆర్గనైజర్లు ఈ వైజ్ఞానిక ప్రదర్శనాలను ఏర్పాటుచేశారు. వారుచేసినది సరియైనదే కూడాను. మహాసభకువచ్చిన ప్రతిరైతూ ఎక్కువ దేశభక్తితోను, మరీ ఎక్కువ ఫాసిస్టువ్యతిరేకతతోను, తన కిసాన్‌సభఅంటే అపరిమిత భక్తితోను తిరిగి వెళ్ళాడు.

ప్రదర్శనానికి ముందు వివిధ రాష్ట్రాల దళాలచే దేశభక్తి పూరితమైన పాటలు పాడబడేవి. ఇవన్నీ మామూలు నినాదాలను పాటలుగా కూర్చినవి మాత్రమే కాదు. చక్కని కవిత్వంలో బాగా పాడటానికి వీలుగా రచింపబడ్డాయి. అన్నిటిలోకి కోగంటి గోపాలకృష్ణయ్య రచించిన "ఎగురవేయి భారతభువిపై" అనే జెండాపాట చాల ఎక్కువ మందిని ఆకర్షించిది. 'మామ' చేత తర్ఫీదు చేయబడిన బొంబాయి దళం వారి హిందీ మరాఠీ పాటలు కూడా నిశ్శబ్దంగానే వుండి విన్నారు. జనం మాటలు అర్థం కాకపోయినా కూడా అందులో వుండే సంగీతం వారిని ఆకర్షించింది.

## ఆంధ్రదళం

నిజానికి ఆంధ్రదళం ఎక్కువ రకాల జానపదరూపాలను చక్కగా ప్రదర్శించింది. ప్రదర్శనాలలో ఎక్కువభాగం వారివే! ఆంధ్రుల కొక లోపంవుంది. వారి రాష్ట్రంలో పరిశ్రమలు తక్కువ. పెద్ద పట్టణం అని చెప్పుకోతగిన దేదీ వారికి లేదు. అందువల్ల వారు ఆధునిక విషయాలను ఎక్కువగా అభ్యసించలేకపోయారు.

వారి విజ్ఞానం నశించుతోంది. ఆ వైజ్ఞానిక రూపాలు ఎక్కువభాగం పొట్టకోసం ముష్టి ఎత్తుకుని జీవించేవారికి జీవనోపాధిగా మాత్రమే మిగిలాయి. ఈ ముష్టివాళ్ళే ఆ రూపాలను ఇంకా నిలబెట్టు తున్నారు. ఇప్పుడు మనపార్టీ వాటిని తీసుకుని పైకి తెస్తోంది. వాటిని అభివృద్ధిచేసి వాటి ద్వారా రైతులను మేల్కొల్పుతోంది. నిజానికి ఆంధ్రదేశంలో విజ్ఞానాన్ని పునరుద్ధరింప చేయడం మనపనిగా తయారైంది.

మనపార్టీచే తయారుచేయబడే వైజ్ఞానిక దళాలింకా సంపూర్ణత్వాన్ని పొందలేదనే చెప్పాలి. వారింకా ప్రాథమిక దశలోనేవున్నారు. అయినా ఆ కళారూపాలను ప్రదర్శించడంలో వారుచూపే చాకచక్యానికి, సహజత్వానికి, వాటిద్వారా వారు ప్రజలలో రేకెత్తించే ఉత్సాహానికి, వారికి ప్రథమ బహుమతి వచ్చింది.

## బుర్ర కథ

ఆంధ్రలో బుర్రకథ చాల ప్రచారంలోవుంది. పురుషుల బుర్రకథదళం ఒక వ్యవసాయకూలీ జీవితాన్ని చక్కగా చిత్రించిచెప్పారు. స్త్రీలదళం సోవియట్ వీరవనితయైన జోయాకథను చెప్పారు. ఫాసిస్టు రాక్షసులచేతులలో పడి జోయా అనుభవించిన క్రూరహింస వర్ణించేటప్పుడు జనమంతా నిట్టూర్పులు విడిచారు. ఆ వీరవనిత తనను హింసలుపెట్టే నాజీలను ఎలా ఎదిరించి ధైర్యంగా ప్రవర్తించిందో విన్నప్పుడు ఉర్రూతలూగారు. మొదట్లో మహిళాసంఘ నాయకులు స్త్రీలను. అందులోను పెండ్లిఅయి కాపరం చేసేవారిని గద్దెపై కెక్కించి అంతమందిలో కథ చెప్పించడమంటే జంకారు. చెప్పించడమా వద్దాఅని వూగులాడారు. కాని చివరకు ధైర్యంచేసి కామ్రేడ్ ఉదయం దళం స్టేజీమీదకుఎక్కి కథ చెప్పింది. మర్నాడు కామ్రేడ్ ఉదయాన్ని చాలమంది రైతు ముసలమ్మలువచ్చి కథ చెప్పినందుకు అభినందించారు. కొందరు సంతోషం పట్టలేక కౌగలించుకున్నారు. మన వాళ్ళు భయపడినట్లు ఎవరూ అపోహపడలేదు.

## భ జ న

ఈ భజనదళంలో వున్నవారంతా చాకళ్ళు. వ్యవసాయకూలీలు. చిన్న మొదలు పెద్దవరకూ అన్నివయస్సులవారు ఇందులో పాల్గొన్నారు. చిత్రంఏమంటే ఈదళాన్ని ఆర్గనైజుచేసినవాడు ఒక విద్యార్థి. కొంచం తెలివితేటలుగల ముఖంగా కనబడటం తప్పితే మిగతా అంతా వారిలాగే వుంటాడు.

రైతుపిల్లలు కొందరు బాలసంఘం పాటలు పాడుతూ, లంబాడీ వేషాలు వేసుకుని లంబాడీ నాట్యంచేశారు.

మరొకదళం - స్త్రీ పురుషులుకలసి కోలాటం ప్రదర్శించింది. దానిలోని పాట "మాస్కోపొలిమేరలోన" అనేది రెడార్మీ ధైర్యసాహసాలను, రెడార్మీ ఎలా నాజీసేనలను చితుగకొట్టుతూన్నదీ అందులో వర్ణించబడింది. రెడార్మీ వీరపోరాటాలను, విజయాలను వర్ణించే చరణాలు వచ్చినప్పుడు ప్రజలలో నుంచి చప్పట్లు, కేరింతలు మిన్నుముట్టాయి.

## వీధి భాగవతం

దీనిలో ప్రదర్శించినకథ "హిట్లరు పరాభవం" మొట్టమొదట హిట్లరు ప్రగల్భాలు, పలుకుతూ, సకిలించుతూ, రంకెలువేస్తూ "వినుడి వినుడి నా వీరప్రతాపం" అంటూ రంగంమీదికి వస్తాడు. హిట్లరుకు ఇరుప్రక్కల మిస్సోలినీ. టోజోలు వుంటారు. ఇద్దరు సూత్రధారులు వంతపాడుతూ, మధ్యమధ్య హిట్లరు పతనమైన

కథాక్రమం శ్రోతలకు విశదీకరిస్తూ వుంటారు. ముస్సోలినీ, టోజోలు తమ ఓటమిని, చేతగానితనాన్ని చెప్పుకుని హిట్లరుమీదపడి యేడ్చేటప్పుడు కథ రక్తికడుతుంది. అప్పుడు కడుపుబ్బేలాగ నవ్వనివారులేరు.

## బెంగాల్ ఆకలి నృత్యం

అన్నిటికంటె ప్రేక్షకులను కదిలించి పారవేసినది బెంగాల్‌దళంవారి "ఆకలినృత్యం." వెదురు కర్రలతో కట్టిన ఆవేదిక నిజానికి నృత్యానికి పనికిరాదు. అయినా కామ్రేడ్ ఉష, ఆమెతోపాటు ఆ ప్రదర్శనం చేసిన కామ్రేడ్స్, చక్కగా నాట్యం చేశారు. ఆకలితోను, అంటువ్యాధులతోను అవస్థలుపడే బెంగాల్‌ను ఎంతో నైపుణ్యంతో ప్రేక్షకుల హృదయాలను కలిచివేసేటట్లు చిత్రించారు. ఉష వేదిక మీదికివచ్చేటప్పటికి ఇసుకవేస్తే రాలని అన్నివేలమంది జనంకూడా అతినిశ్శబ్దంగా వున్నారు. ఆమె అభినయంచూచి కంటతడిపెట్టారు. ఆమెనృత్యం ముగినేసరికి బెంగాల్‌నిధికి విరాళాలు వర్షించాయి. ఆమహాప్రవాహాన్ని ఆపకపోతే మిగతా కార్యక్రమం సాగేటట్లులేదు అందుచేత సుందరయ్య మైక్‌దగ్గరకువెళ్ళి, ప్రజలకు "విరాళాలు తరువాత ఇద్దురుగాని, కార్యక్రమాన్ని సాగనివ్వండి" అని విన్నపం చేయవలసివచ్చింది.

అభినయచాతుర్యానికి ఉషకు ప్రథమ బహుమానం వచ్చింది. దీనికి ప్రజలెంతో హర్షించారు. ఆహ్వానసంఘం బెంగాల్‌నిధికి వెయ్యిరూపాయలు యిచ్చింది. అంతేగాకుండా, ఇతర రాష్ట్రాలనుంచి వచ్చిన వైజ్ఞానికదళాలకు వారికి కావలసిన వాయిద్య పరికరాలు కొనియివ్వడానికికూడా వాగ్దానంచేసింది.

## ఐక్యతా సందేశం

అర్ధరాత్రయింది. విజ్ఞాన ప్రచారకకార్యక్రమం కొంతవరకు సాగింది. నేను మాట్లాడానికి లేచాను. ఆంధ్రదేశంలోని కాంగ్రెసు ప్రముఖులతో సంప్రదించాలని నేనుకోరాను. ఇందుకు వారు నిరాకరించారు. అంతేకాకుండా, పార్టీవిధానం ప్రభుత్వానికి మద్దతునిచ్చే విధానమని తెలుగుపత్రికల్లో ఏమేమో ఆడిపోశారు. ఇందువల్ల నాపై ఒక ప్రత్యేకబాధ్యత పడింది. నా ఉపన్యాసంలో మనపార్టీ పాలసీని సమర్ధించడమే కాకుండా, అది ఎలా దేశభక్తియుత మార్గమో వివరించవలసి వచ్చింది.

గాంధీజీ జాబులు బయటపడ్డానికి పూర్వం దేశంలోని కాంగ్రెసువాదు లందరూ ఏమీతోచని ఆయోమయావస్థలో ఉండేవారు. ఆంధ్ర కాంగ్రెసువాదుల్లో అనేకులు ఈనాటికూడా ఆస్థితిలోనే ఉన్నారు. అందువల్ల దేశభక్తులందరికీ అంగీకార మయేలా మాట్లాడానికి ప్రయత్నించాను :

"1930 కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొన్న యువకులే ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీకి పునాది. వారు కిసాన్ యువతీయువకులు — మీబిడ్డలు. ఒకరూ, ఇద్దరూ కాదు — 5000 మంది.... దేశసేవకులైన ఈమీ బిడ్డలు, దేశభక్తి సందేశాన్ని ప్రజల్లో వ్యాపింపచేశారు. ఒక లక్ష సభ్యత్వంగల బలవత్తరమైన కిసాన్‌సభను నిర్మించారు; 30,000 మంది బలంగల వ్యవసాయకూలీ ఉద్యమాన్ని; 25.000 సభ్యత్వంగల ట్రేడ్‌యూనియన్లను, 20,000 సభ్యత్వంగల మహిళాసంఘాలను, 18,000 సభ్యత్వంగల బాల సంఘాలను, నిర్మించారు. మమ్మల్ని ఆడిపోస్తున్న కాంగ్రెసువాదులు యీ బ్రహ్మాండమైన నిర్మాణాన్ని, దీని ఫలితాలను చూడరు....

మాపార్టీ ఎలాంటిది? దేశభక్తియుత విధానాన్ననుసరిస్తున్న పార్టీ యిది. దేశభక్తితో కూడుకున్న ఇతరసంస్థలు అవలంబిస్తున్న విధానంతో మాపంథా ఏకీభవిస్తూంది. వైస్రాయికిరాసిన జాబుల్లో గాంధీజీ ఏమిచెప్పారో అదే మొదటినుంచీ మేము చెబుతూవచ్చాం. కాంగ్రెసువాదుల్నందర్నీ ఏ కార్యాచరణకు సరోజినీదేవి ప్రోత్సహిస్తూందో ఆ కార్యక్రమాన్నే ఆచరిస్తూ వస్తున్నాం; జాతీయైక్యతకోసం పాటుపడుతున్నాం; కరువు నివారణకు కృషిచేస్తున్నాం.

కాంగ్రెసువాదులకు, కమ్యూనిస్టులకు తల్లిదండ్రులు మీరు. మాఇద్దరికీ పొత్తు కుదర్చడానికి మీరు సాయశక్తులా ప్రయత్నించాలి. మాకు కాంగ్రెసువాదులు అన్నలు. మావిన్నపం ఆలించేవరకు వారిదగ్గరకు వెళ్తూనే ఉంటాం. ఆంధ్రదేశంకోసం మేమెంత పాటుపడ్డామో వారికన్నా మీరు బాగా ఎరుగుదురు. ప్రతిష్టంభనను పరిష్కరించడానికి కొనఊపిరున్నంత వరకు పాటుపడతాం. కాని మాఒక్కరివల్లనే అది సాధ్యమవుతుందని మేమనం. కమ్యూనిస్టులు, కాంగ్రెసువాదులు చేయిచేయి కలిపినప్పుడు, వారినడ్డగలశక్తి ఉండదు. మన కళ్ళ యెదుట నూతనప్రపంచం ఉద్భవిస్తుంది. అందులో, ఉజ్వలపాత్ర వహించగల నూతన భారతదేశంలో, నూతన ఆంధ్రదేశాన్ని నిర్మించడానికి అందరంకలిసి పాటుపడదాం."

"అంతబాగా మాట్లాడగలరని అనుకోలేద"న్నారు నన్నెరిగిన కామ్రేడ్సు. ఒక లక్షమంది ఉత్సాహవంతులు ఎదుట కనబడుతుంటే ఎవరు ఉత్తేజితులుకారు?

కాని ఈ ఉపన్యాసం నాకు పెద్ద చిక్కుతెచ్చిపెట్టింది. మహాసభకు "పీపుల్సువార్" తరఫున విలేఖరిగా వెళ్లాను. యథేచ్ఛగా అంతా తిరిగి చూడాలనుకున్నాను. ఈ ఉపన్యాసం జరిగినదగ్గర్నుంచి దీనికి అంతరాయంకలిగింది. నేనెక్క

దికి వెళితే, అక్కడొక పెద్దగుంపు తయారయేది. అక్కడి బందోబస్తుకు అడ్డు తగులుతుండేది.

## భోజన సదుపాయాలు

అన్నిటికన్నా నాదృష్టి నెక్కువగా ఆకర్షించింది వంటశాల. ఆంధ్ర కాంగ్రెసు ఈవిషయంలో కాంగ్రెసు సమావేశాలకన్నా కొత్తదారి తొక్కారు. భోజన సదుపాయాలను కంట్రాక్టర్లచేతిలో పెట్టలేదు. దేశభక్తి, స్వార్థరాహిత్యం ఉట్టిపడవలసిన వాతావరణంలో ఈ కంట్రాక్టర్ల యేర్పాటు ఒక మచ్చగా ఉండేది. పైగా వాళ్ళు తయారుచేసే కల్తీ వంటకాలు కలరా మొదలయిన జాడ్యాలకున్కూడా దారితీయగలదు.

ఈ మార్గాన్నవలంబించక ఆంధ్ర కాంగ్రెసు 13 సమిష్టి భోజనశాలలను యేర్పాటు చేశారు. ఒకొక్కటి 5000 మందికి సరిపోతుంది. 1500 మంది వలంటీర్లతో ఒక ప్రత్యేక బందోస్తు శాఖను వీటికి నియమించారు. 200 మంది రైతు మాతలు, అవ్వలు ప్రధాన బాధ్యతను వహించారు. తమ పెద్ద కొమాళ్ళ పెళ్ళికా అన్నట్లు ఉత్సాహంతో ఉప్పొంగి పోతూ ఈబాధ్యతను నెరవేర్చారు.

మొత్తం ఒక లక్ష భోజనాలు వడ్డింపబడ్డాయి. మార్చి 14, 15 తేదీల్లోనే 10,000 మంది భోంచేశారు.

వంటలకు కావలసిన బిందెలు, తపేలాలు చాలవరకు రైతులే ఇచ్చారు. బియ్యం విరాళంగా ఇస్తామని చాలమందన్నారు. కాని, రవాణా సౌకర్యాలులేకపోవడంవల్ల వాటికి అంగీకరించలేదు. ఆహ్వానసంఘం అంతటితో ఊరుకోలేదు; రైతుబాబులు 50 టన్నుల కట్టెలు, రాసులకొలది కాయగూరలు, ఒకొక్క బండెడు సొరకాయ, కంద, పెండలం; ఇరవైయ్యేని మణుగుల వంకాయలు, దోసకాయలు, 80 మణుగుల అరటికాయలు వర్షంకురిపించారు. అంతేకాదు, 200 కుండలతో గోంగూర, నిమ్మకాయ మొదలైన పచ్చళ్ళు - పచ్చడిలేకపోతే ఆంధ్రులకు భోజనంచేసినట్టే ఉండదు. 2000 శేర్ల పెరుగు - మజ్జిగలేనిది తిండి జీర్ణంకాదంటారు ఆంధ్ర సోదరులు. కూరలరుచిని పెంచడానికి 300 కొబ్బరికాయలు, అబ్బ-ఎంతెంత రాసులు - వింత మేలైనరకాలు! వాటిమీద సుత్తీ కొడవలి చిత్రాలతో మరి, ఆదృశ్యం చూడవలసిందే కాని చెప్పనలవికాదు.

## చిన్న లోపం

మొదటిపూట భోజనాలమీద ఫిర్యాదులువచ్చాయి. అన్నం సరిగా వుడకలేదు. అంత పెద్ద ఎత్తున అన్నవండడం వందమంది వంటవాళ్ళకే సాధ్యం; ఆపెద్ద

బొనల్ని ఎత్తిదించగలరు. ఈ వందమందిని రోజుజీతానికి పెట్టారు. వీళ్ళకు రాజకీయచైతన్యం ఏమీలేదు - వీళ్ళచేత సరిగా పనిచేయించడం అలవికానిపనయింది. ఫిర్యాదులు వచ్చేసరికి రైతుమాతలకు ముఖం చిన్నపోయింది. ఏలాంటి లోటు రాకుండా చేయడానికి ఎంతోకష్టపడ్డారు. ఇప్పుడిలా అయింది. వాళ్ళస్థితిని చూచి నేను దగ్గరకు వెళ్ళాను. "వచ్చేసంవత్సరానికి ఇంతకన్నా నాలుగింతలు అవ్వాలు, రెండింతలు వలంటీర్లు వుంటారనుకోంగి - అప్పుడు ఇంటిదగ్గరలాగా మంచి భోజనాలు పెట్టలేరూ? అని అడిగాను. "నిస్సందేహంగా!" అని జవాబువచ్చింది. వెంటనే వాళ్ళన్నారు- "అన్నంవండేవాళ్ళ సంఘం నిర్మించడానికి వెంటనే ఒక హోల్ టైమర్‌ని ఏర్పాటు చేయవలసిందని సుందరయ్యతో చెప్పండి-"అని.

## అన్నిటికన్నా పెద్దకుటుంబం

వాళ్ళకు మరో పాఠం నేర్పాలనుకున్నాను. "సరే చెప్పండి - ఏది ఎక్కువ? ఏవో ఫిర్యాదులా, లేక భోజనానికివచ్చేవాళ్ళ ప్రశంసలా?" అని అడిగాను. "ప్రశంసలే- తప్పకుండా!" అన్నారు. అని, బహుకొద్దిమంది మనుషులు వచ్చినా, పెళ్లిభోజనాల్లో ఎంత గందరగోళం అవుతుందో వర్ణించారు. "చూచారా, మరి! ఈమాత్రం దానికే ఎందుకంత చిన్నబోతారు?" అని ఎత్తిపొడిచాను. ఆపూట ఫిర్యాదులకు వాళ్లుపడ్డఅవస్థనుచెప్పి. "అదికాదు సంగతి. ఇళ్ళల్లో భోజనాలకన్నా మహాసభలో భోజనాలు బాగున్నాయని అందరిచేతా అనిపించాలని ఆశించాం. మరి చూడండి - రైతుసంఘం అన్నికుటుంబాలకన్నా పెద్ద కుటుంబంకాదూ - అందరినీ సంతుష్టిపరచవద్దూ!" అని జవాబువచ్చింది. నానోటి వెంట మరి మాటరాలేదు. విప్లవజీవికి ఉచితమైన వినమ్రత వీరిదగ్గర నేర్చుకోవలసి ఉంది - తగుదునని మంచిమాటలతో వీరికి హుషారివ్వాలనుకోవడం కట్టిపెట్టాలని గ్రహించాను.

## మా మి డి తో పు లో

ఆకర్షవంతమైన ప్రదేశాల్లో మరొకటి మామిడితోపు. మహాసభ పెండాలుని ఆనుకొనేవుందిది. 1000 బళ్ళు అక్కడ విడిశాయి. మరో 500 బళ్లను కాలవ పక్కను విప్పారట. ఒకొక్క బండిలో 10, 12 మంది కావలసిన ఆహారపదార్థాలతో వచ్చారు. వీళ్ళల్లో పెద్ద వీరికి తిండిపెట్టడం మాత్రమేకాక, తమగ్రామం నుంచి కాలినడకను వచ్చినవారికిక్కూడా ఉన్నంతమట్టుకు పెట్టేవారు. దేనికీ అంగడికి పోనవసరంలేకుండా అన్నీ తమ బండ్లలోనే స్టాకు చేసుకున్నాయి ఈ రైతుకుటుంబాలు. ఇంతెందుకు. తమగ్రామజీవనాన్ని ఆమామిడితోపులో కొంతవరకు పునఃప్రతిష్టించారు.

ఆ చెట్లనీడల్లో చాపలు వేసి తీరుబడిగా కూర్చునేవారు. ఎవరెలా మాట్లాడారు; అందరికన్నా బాగా పాడిందెవరు - ఇలాంటి విషయాలపై వాదోపవాదాలు ఇకసాగేవి. అన్నిటికన్నా ఎక్కువగా ఉష నృత్యం గురించి సంభాషణలు సాగుంటాయని నేననుకున్నాను. కాని పొరబడ్డాను. అడవిపొదలాగా, చీదరబాదరగా ఉన్న నాజుట్టునుగురించి ఎక్కువగా సంభాషణలు సాగాయట సంగతులన్నీ తెలుసుకొని రమ్మని నేను నియమించిన ఆంధ్ర కామ్రేడ్సు తెచ్చిన భోగట్టా అది.

మానికొండ సూర్యావతినిగురించి వచ్చిన స్త్రీలందరూ ముచ్చటగా మాట్లాడుకున్నారు. ఇరవైయేళ్ల నిండాయో లేదో రాష్ట్రపార్టీ ఆర్గనైజరు పదవికి వచ్చింది. బక్క పల్చగా - ఎండనక, ధూళనక, తిండీ నిద్రల్ని లెక్కచేయక పనిచేసింది సూర్యావతి.

సుందరయ్యను ఒక ప్రత్యేక తరహామనిషిగ - ఒక మహాపురుషునిగ లెక్కకట్టారు. అన్ని వేలమంది వలంటీర్లను సునాయాసంగా, చాకచక్యంతో పనులన్నీ జరిపించిన రాజేశ్వర్రావు అందరిచేత 'సేబాస్' అనిపించుకున్నాడు. సావిత్రి (రాజేశ్వర్రావుభార్య, కూడా ఒక స్త్రీవలంటీరుదళాధిపతే. వీరిద్దరి ఈడుజోడు, కార్యదీక్షనుచూచి అంతా ముచ్చట పడ్డారు. పృధ్విసింగ్ సాహస కార్యాలను గురించి ఎంతగానో చెప్పుకున్నారు. పంజాబునుంచి వచ్చిన వృద్ధకేసరులు జైళ్ళలో గడపిన దీర్ఘకాలాన్ని తలచుకొని ఆశ్చర్యపడ్డారు.

మామిడితోపులోని ఈ సంభాషణలనన్నిటిని వింటూంటే పార్టీ అంటే ఈ రైతులకెంత అభిమానవిషయమయిందో స్పష్టమవుతుంది. తమ ఇంటివిషయాలను గురించి మాట్లాడుకున్నట్టే పార్టీని గురించి మాట్లాడుకున్నారు. ఒకప్పుడు మత విషయాలను గురించి చర్చించినంత తీవ్రంగా మహాసభ విషయాలనుగురించి చర్చించారు.

దేశభక్తే నేటి ఆంధ్రరైతాంగానికి మతం కాగల దశను మనం తీసుకొస్తున్నాం. పార్టీని తన కుటుంబంగా పరిగణించే స్థాయికి అభివృద్ధి చేస్తున్నాం.

## మ హా స భ ని ధి

మహాసభ నిధి వసూలయిన పద్ధతే ఇందుకు నిదర్శనం. రు. 75 వేలకు పైగా నిధి. 2 వేలకు పైగా గ్రామాలనుండి వసూలయింది. ఇంత పెద్ద మొత్తం 2 వారాల్లోనే ప్రోగయింది. సుమారొక లక్ష కుటుంబాలు శక్తికొలది విరాళాలిచ్చాయి. 50 వేల కుటుంబాలు డబ్బురూపంలోను, అంతకన్నా కొంచెం తక్కువగా వస్తురూపంలోను - మరికొన్ని రెండువిధాలానూ విరాళాలిచ్చాయి. ఒక

కుటుంబం 1000 రూపాయిలిచ్చింది. రు. 10 మొదలుకొని రు. 100 వరకు ఇచ్చినవి అనేకం ఉన్నాయి. ఎక్కువగా వసూలయింది రూపాయి నోట్లలోను, బీదరైతులనుండి చిల్లర డబ్బుల్లోనే. రైతాంగంలో ప్రతితరహావారు - ధనికరైతు మొదలుకొని, భూమిలేని వ్యవసాయకూలీవరకు విరాళాలిచ్చారు. నిధి చాలకపోతే ఇంకా ఇస్తామని వాగ్దానంచేశారు.

అనుమానాలు, సంకోచాలూ లేకుండా పనిచేసి మహాసభను దిగ్విజయంగా జరపమని కామ్రేడ్సుని ఉత్సాహపరిచారు. కామ్రేడ్సు మహాసభను దిగ్విజయంగా జరపడం మాత్రమే కాదు, 15, 20 వేల రూపాయీలు మిగిల్చారుకూడా.

ఆహ్వానసంఘం సమావేశమయి జమాఖర్చులు తేల్చినప్పుడు రైతుపెద్దలు వచ్చి, కామ్రేడ్సుని 'సెబాస్' అంటారు. అనుభవంతో తలలు నెరిసిన రైతు బాబులు తమ పొలంపనుల నెంత సక్రమంగా సాగించుకుంటారో ఈ కామ్రేడ్సు తమ రైతుసంఘాన్నంత చక్కగా నడుపుకోగలరని గుర్తిస్తారు.

## క్లుప్తంలో

రైతుమహాసభ|పుత్సాహాన్ని, అక్కడి ఉజ్వలవాతావరణాన్ని అన్నిమాటల్లో చెప్పలేను. దానినంతటిని ప్రతిబింబిస్తున్న ఒక చిన్న ఉదంతంచెప్పి ముగిస్తాను.

16వ తేదీ ఉదయం. మహాసభ ముగిసింది. మామిడితోపులో అంతా మూటాముల్లే కట్టుకొని ఇళ్ళకు ప్రయాణమవుతున్నారు. ఒక వలంటీరు కామ్రేడు తన భార్యకు రెండు పుస్తకాలందిచ్చాడు. ఒకటి పాటల పుస్తకం. (మరిచా, పార్టీ బుక్‌స్టాల్సులో సాధారణంగా రెండు మూడు నెలల్లోనయినా జరగనంతటి పుస్తకాల అమ్మకం ఆ రెండురోజుల్లో జరిగింది.)

అవి ఇచ్చేసి తన వలంటీరు స్థానానికి వెళ్ళడానికి తిరిగాడు. అప్పుడామె అతని కళ్లల్లోకి చూచింది. వర్ణించనలవికాని ఆ చూపు నేను బాగా ఎరుగుదును. వెళ్లిపోతున్నందుకు చింత. ఆ చింతని ముంచేసే చిరునవ్వు - ఒక మహోద్యమంలో చేదోడు వాదోడుగా పాల్గొంటున్నందుకు ఒకరినిచూచొకరు గర్వపడుతూ మురిసిపోయే చిరునవ్వు.

ఆ వలంటీరు వెనక్కి తిరిగేసరికి నేను ఎదుట ప్రత్యక్షమయాను. అంత దగ్గరలోఉండి అంతా చూచానని తబ్బిబ్బయ్యాడు. వెంటనే అతనిని సంభాషణలోకి దించాను. ఆపక్కనే కూర్చున్న ముసలమ్మ ఎవరని అడిగాను. అతనితల్లి. ఆమెచేతిలోసబిడ్డ? అన్నగారిబిడ్డ. ఆ బిడ్డకా ముసలమ్మ నేర్పేతూన్న పాఠమేమిటి? "రైతునాయకుడు స్టాలినూ - రైతుల కొమాళ్ళు స్టాలిను బిడ్డలు."

భార్య పార్టీ సభ్యురాలా అని అడిగాను. "ఇంకా కాదు. కాని, మహాసభ నుంచి ఇంటికివెళ్ళిన తక్షణం వెళ్లి కార్యదర్శిని కలుసుకొని పార్టీసభ్యురాలు కావడానికి ప్రయత్నిస్తుందట. నేను ఇల్లు చేరుకునేసరికే పార్టీసభ్యురాలుకావాల నుందట." అని ఉత్సాహంతో జవాబు చెప్పాడు.

"ఇదివరకేమిచేస్తుండేది?" గ్రామ మహిళాసంఘంలో పనిచేస్తుండేది. మహాసభలో వలంటీరు.

ఇంకేమి అడుగుదామా అని ఆలోచిస్తున్నాను. ఇంతలో ఉత్సాహంతో ఉప్పొంగుతూ ఆవలంటీరు కామ్రేడిలా అన్నాడు: "ఈ సమావేశం ఫలితంగా నాకుటుంబమంతా కమ్యూనిస్టు కుటుంబం అయిపోతుంది!"

"తక్కిన కుటుంబాల సంగతో?"

"నేనొక్కడినేకాదిలా అంటోంది. ఏయేకామ్రేడ్స్ కుటుంబాలు మహాసభకు వచ్చాయో ఆ కామ్రేడ్సంతా సగర్వంగా చెబుతూన్నవిషయం ఇదే. ఆకుటుంబా లన్నీ కమ్యూనిస్టు కుటుంబాలు కాబోతున్నాయి."

## తీర్మానాలు

కస్తూరిబా, ఆర్. యస్. పండిట్‌గార్ల మరణమునకు. కిసాన్‌సభకోసం యావత్‌జీవితమూధారపోసి క్షామమును, అంటువ్యాధులనుఅరికట్టుటకై పాటుబడుతూ అశువులర్పించిన వారికై హృదయపరితాపమును వెలిబుచ్చుచూ తీర్మానాలుచేశారు. ఇరవై అరుగురు త్యాగుల పేర్లు ప్రత్యేకముగా పేర్కొన్నారు. వారిలో యిరవై ఒక్కరు బెంగాల్‌నుంచి.

సోవియట్ ప్రజలను, ఎర్రసైన్యాన్ని. సాటిలేని నాయకుడు మార్షల్ స్టాలిన్‌ను మనస్ఫూర్తిగా అభినందించారు. ధైర్యోత్సాహులైన చైనాప్రజానీకాన్ని మెచ్చుకొన్నారు.

రాజకీయ ఖైదీలను విడుదల చెయ్యాలని. ప్రతిష్ఠంభన తొలగించాలని, కార్మికోద్యమాలతోను. భారతప్రజల న్యాయమైన కోర్కెలను బలపరచుచున్న బ్రిటన్ అమెరికాలలోని అభివృద్ధికరమైన శక్తులతోను సంఘీభావమును వెలి బుచ్చుతూ ముఖ్యమైన రాజకీయ తీర్మానము చేశారు.

## రైతులకు స్పష్టమైన కార్యక్రమము

దృష్టిఅంతా ఆహారసమస్యమీద కేంద్రీకరించబడింది. అధికోత్పత్తి తీర్మానములో గతసంవత్సరము సంపాదించిన విజయాలను జ్ఞప్తికితెస్తూ, అధికోత్పత్తికై

తీవ్రతరమైన కృషిచెయ్యాలని, రైతునెదుర్కొనుచున్న అడ్డంకులను తొలగించాలని, ప్రభుత్వమును కోరుతూ తీర్మానించారు.

ఈ తీర్మానంలో ఆహారపదార్థాలు సేకరించటమనేది కేంద్రప్రభుత్వపు ఆహారవిధానములో కడు ముఖ్యమైన విశేషం. కాని, ఆచరణలో ప్రభుత్వవిధానము వల్ల వ్యతిరేకమైన ఫలితాన్ని పొందుతున్నది. 1944 సంవత్సరానికి ఆహారపదార్థాల సప్లయికి 1943 నాటి తిండిదొంగలమీద ఆధారపడుతున్నది. దేశభక్తితో ప్రజలు చేయుకృషిమీద ఆధారపడటానికి నిరాకరిస్తున్నది; తిండిదొంగలకు వ్యతిరేకముగా ధరలకంట్రోలు అమలు జరిపి, రైతులు సరసమైన ధరలకు అధికపంట అమ్మేందుకు ప్రోత్సాహపరచగల్గి, పట్టణాలలో రేషనింగు అమలుజరుపగల జాతీయ ప్రభుత్వమునకు అధికారము ఒప్పగించుటకు నిరాకరిస్తున్నది.

ఆ తీర్మానం ఆహారపదార్థాలను రైతులు తిండిదొంగలకు అమ్మకుండా, ప్రభుత్వపు యేజంటుకు అమ్మి ఆహారసమస్య పరిష్కరించటానికి తోడ్పడాలని కోరింది. అప్పుడు పట్టణాలలో రేషనింగు జయప్రదమై, వుమ్మడి బేరసారాలవల్ల సరసమైన ధరలు పొందవచ్చును. గ్రామైక్యతవల్ల స్వయంపోషకత్వము యేర్పడి నిరాధారులైన పేద జనానికి తిండి యేర్పాటు చేయకల్గుతారు.

తిండిదొంగలను అరికట్టటానికి కాంగ్రెస్-లీగు ఐక్యతకావాలని కోరింది.

కిసాన్‌సభ పాలసీమీదనే కార్యక్రమముతోకూడిన తీర్మానము ఆమోదించబడ్డది.

రైతుమహాసభయొక్క ఫాసిస్టు వ్యతిరేక పాలసీని పునర్వచించుచూ, ఫాసిస్టు వ్యతిరేకశక్తులతోకలసి జాతీయప్రభుత్వ స్థాపనద్వారానే స్వాతంత్ర్యం లభిస్తుందని ప్రకటించింది. "కిసాన్‌సభ బలాన్నిచూచి ఓర్వలేనివారు, జాతీయవ్యతిరేకశక్తులు, ఇతర విచ్ఛిన్నకారకులు, రైతుమహాసభను కమ్యూనిస్టులు తమ చేతులో కీలుబొమ్మగా చేసుకొన్నారని, తమ పాలసీని మహాసభ నెత్తిపైరుద్దుతున్నారని విషప్రచారము చేస్తున్నారు." అందువల్ల రైతుమహాసభ తన పాలసీని నిర్వచించటం చాలా అవసరం. తీర్మానం యేమిటంటే దేశభక్తి పూరితమైన ఫాసిస్టు వ్యతిరేకవిధానమును కిసాన్‌సభ అవలంబిస్తున్నది. జాతీయైక్యతకు నాయకుల విడుదలకు ఆందోళనచేస్తూ, రైతులకోర్కెలకై దైనందిన కార్యక్రమమును సాగిస్తూ, రైతుసంఘాలను బలపరచి, రైతువుద్యమాన్ని నిర్మించింది. అధికోత్పత్తి ఆహారసమస్య పరిష్కారానికి పాటుబడుచున్నది.

కిసానుసభ ప్రజాసంస్థగా బలపడ్డది. రైతుసేవచేయుటకు, జాతీయ ప్రతిష్టంభన తొలగించుటకు అనేకమంది దేశభక్తులు కాంగ్రెస్‌వారు, ముస్లింలీగువారు

కిసాన్‌సభచే ఆకర్షింపబడుతున్నారు. నిగ్గుతేరిన రైతుసేవకులలోను, నాయకుల లోను కొంతమంది కమ్యూనిస్టులున్నప్పటికి కిసాన్‌సభ పాలసీని యేపార్టీగాని, గ్రూపుగాని ఆదేశించలేదు.

అన్నిపార్టీలు, గ్రూపులు కలసి సమిష్టిగా చర్చించి కిసాన్‌సభ పాలసీని నిర్ణయించుతారు.

ఈ చిత్తుతీర్మానం స్వామీజీకి యెంతో తృప్తికల్గించింది. కిసాన్‌సభలోనున్న భేదాలను, గోరంతను కొండంతలుగా చేయదలచిన విచ్ఛిన్నకుల ప్రయత్నాలకు పురిటిలోనే సంధికొట్టింది.

పై తీర్మానం కాంగ్రెస్, లీగు సభ్యులకు, కిసాన్ వుద్యమంలో కలసి పని చేసి కిసాన్‌సభను దేశభక్తిపూరితమైన సంయుక్త ప్రజాసంస్థగా నిర్మించాలని ఒక మహత్తరమైన సందేశం.

## ఆంధ్ర రైతాంగాన్ని వుద్రేకపరచింది

ఆంధ్ర రైతాంగం యీ మహాసభను యేవిధంగా చూస్తున్నది? ఇందుకు ఒక చిన్న ఘట్టం వుదహరిస్తాను.

ఒక ముసలమ్మ వాలంటీర్లుగా పనిచేస్తున్న తన కొమాళ్ళను వదలి, కోడ లిని, 4 సం॥ బిడ్డను వెంటబెట్టుకొనివస్తూ ఆబిడ్డకు 'కమ్యూనిస్టు పార్టీకి జై' అని నేర్పుతున్నది.

రైతువుద్యమానికి యేం తెలియచేస్తున్నది? ఈ మహాసభ రైతు వుద్య మానికి విశాలమైన పునాదులను వేసింది. ఇప్పటివరకు పల్లెలనుండి రైతుయువ కులుమాత్రమే ముందుకు వస్తూంటే, రైతులలో పెద్దలు వారికి సహాయపడుతూ మాత్రమే వుండేవారు. గ్రామాలలోని పెద్దలు తమ పుత్రులనుచూచి గర్వించుటయే కాకుండా, యీ రైతుమహాసభ చారిత్రాత్మక దృశ్యాలు వారిని వుద్రేకపరచినవి. తమ బిడ్డల శక్తిసామర్థ్యాలందు విశ్వాసం అధికమయింది.

ఇకముందు రైతుపెద్దలు రైతుసంఘ దైనందిన కార్యక్రమంలో పాల్గొంటూ తమ స్వానుభవంవల్ల యెంతో తోడ్పడతారు. ఆవిధంగా రైతుసంఘాలకు విశాల మైన పునాదులు యేర్పడి క్రొత్తస్థాయికి రైతువుద్యమం వచ్చింది.. ఇకముందు బెజవాడలో చూసిన వాటికంటెకూడ అభివృద్ధి చెందుతుంది.

## విచ్ఛిన్నకులు విచ్ఛిన్నమయ్యారు

తరువాత, జాతీయవాదులలో కొంతమంది కిసాన్ సభవైపు మొగ్గటం ప్రారంభిస్తున్నారు. కాంగ్రెస్ దేశభక్తులు రైతుమహాసభ చుట్టుప్రక్కలకైనా రాకుండా చేయటానికి విపరీతమైన ఆందోళనచేశారు. మహాసభ యింత జయప్రదంగా జరుగుటవల్ల మన ప్రతికక్షులకు గుండెదిబ్బరం పోయింది. మనలను బలపరచేవారికి వుత్సాహం కల్గించింది. దేశభక్తులలో తటస్థులు జరిగిన ఘటనలను గూర్చి పునరాలోచించు కొంటున్నారు. రంగాగ్రూపు ప్రచారం విజమేఅయితే, ఆంధ్రా కాంగ్రెస్ నాయకులు చెయ్యలేనంతపని వీరు యెలా చేసివుంటారు? ఇంత ప్రజా సమీకరణ, రైతులలో యింతబలం, యింత నిపుణతగల్గిన సేవకులను యెట్లా సేకరించగల్గేవారు? అనేవిషయాన్ని తటస్థులుగావున్న దేశభక్తులు పునరాలోచిస్తున్నారు.

ఇందుకు నిదర్శనంగా సుప్రసిద్ధ కాంగ్రెస్‌నాయకుడు, రెండవరోజు డయస్ మీద కూర్చోడమే. అంతేకాకుండా మన జాతీయపత్రికలుకూడ మహాసభ విశేషాలు యెక్కువగా ప్రకటించాయి. మనపార్టీ కాంగ్రెస్‌కుకూడ జాతీయపత్రికలు యింతచోటు యివ్వలేదు.

మన కామ్రేడ్సు ప్రజలయెదుట ఈవిధంగా చెప్పాలి: రైతులలోనుంచి వచ్చిన కమ్యూనిస్టులే ఇంత ప్రజాసమీకరణ చేసినప్పుడు ఆహార స్వాతంత్ర్యములు సంపాదించటానికి కాంగ్రెస్, కమ్యూనిస్టులు కలిసి పనిచేసి సాధించలేనిది యేముంటుంది? నిష్కల్మషులైన దేశభక్తు లందరు గౌరవంతో మనం చెప్పేది వింటారు. ఈమహాసభ యావత్ భారత కిసాన్ వుద్యమానికి యేవిధంగా ఉపయోగిస్తున్నది?

కిసాన్‌సభలోని కమ్యూనిస్టు, కమ్యూనిస్టులు కాని నాయకులమధ్య ఐక్యతను గట్టిపరచింది. కిసాన్‌సభ వెలుపలవున్న దేశభక్తులతో కలియాలని సూచించింది.

కిసాన్‌సభను బలపరచి రైతు కోర్కెలను నెరవేర్చుకొనుటకు దేశానికి తిండి గల్గించి తిండి దొంగల యెత్తులను సాగనివ్వకుండునట్లు దేశానికి తన కర్తవ్యాన్ని నెరవేర్చునట్లు రైతులకు సహాయపడదలచుకొన్న కాంగ్రెస్ వారిని, లీగ్ వారిని కిసాన్ సభలో చేరమని హృదయపూర్వకంగా ఆహ్వానించింది. కాంగ్రెస్, లీగ్ ఐక్యతకు తీవ్రమైన ఆందోళన చెయ్యాలని నిశ్చయించుకొన్నది. కిసాన్‌సభ ఆందోళన వల్ల జరిగేది యేంలేదని యెవరనగలరు? మహాసభలో ప్రజాసమీకరణకు తగినట్లు కిసాన్‌సభ్యత్వం 550,000; ఇంకా పెరిగిపోతున్నది.

బెజవాడ మహాసభ అనంతరం కిసాన్‌సభ జెండా పూర్వం కంటె ఉన్నతస్థాయిన యెగురుతోంది. మన జాతీయజీవితంలో యెక్కువ ప్రాముఖ్యత వహిస్తోంది. ప్రజల అహారం రైతుల చేతుల్లోవుంది. కాంగ్రెస్ లీగులలో యిమిది

వున్న దేశభక్తి పూరితమైన సాంప్రదాయాలలో కాంగ్రెస్, లీగులకు తమలోవున్న విశ్వాసంకంటె కిసాన్‌సభకు యెక్కువ విశ్వాసం కాంగ్రెస్ లీగులమీద ఉన్నది. కిసాన్‌సభ యందైక్యత అధికమై రోజురోజుకు బలపడుతోంది. ఆహారం. తదితర కిసాన్‌సభ దైనందిన కార్యక్రమం ద్వారా కిసాన్‌సభ 1944 లో కాంగ్రెస్ లీగులను యైక్యపరచుటకు అత్యంత ప్రాముఖ్యమైనపాత్ర వహిస్తుంది. కిసాన్‌సభ సాధించే ప్రతి విజయం తిండి దొంగలకు చెంపపెట్టు. కాంగ్రెస్, లీగు ఐక్యతకు మొదటిమెట్టు. ప్రతిష్టంభన పునాదులను కదల్చి నాయకుల విడుదలకు దారితీసి దేశంలో అనైక్యతను తొలగించి కాంగ్రెస్, లీగు ఐక్యతకు పునాదులు వేస్తుంది. కిసాన్‌సభ కార్యాచరణ యీ విధంగా ఫలించాలని కోరనివారెవరు ?

బెజవాడలో యీ దృక్పధంతో కార్యాచరణ సాగిస్తున్నది.

# మా బిడ్డలే కమ్యూనిస్టులు

పి. సి. జోషీ

8 వ రైతుమహాసభ సందర్భంలో జరిగిన వైజ్ఞానిక ప్రదర్శనలను ప్రారంభిస్తూ జోషీ ఇలా అన్నాడు :

ఆంధ్ర కార్మిక, కర్షక సోదరులారా !

నేను చెప్పదలచుకున్న విషయం చాల పెద్దది - కష్టమయిందికూడాను. ఆంధ్రలో పార్టీ స్థానం - ముఖ్యంగా వైజ్ఞానిక రంగంలోను, ఆంధ్ర సామాజిక జీవితంలోను ఏమిటి ? ఇదీ నేను చెప్పదలచుకున్న విషయం.

ఆంధ్ర రైతాంగమయిన మీరు ఈనాడు కమ్యూనిస్టుపార్టీని బాగా ఎరుగుదురు. ప్రపంచంలోని మరే ఇతర రాజకీయపక్షంకన్న దీన్ని - మీ కొమాళ్ళు, మీ కొమార్తెలు ఉన్న ఈ పార్టీని - గురించి ఎక్కువ తెలుసుమీకు. దీనితో మీ కెక్కువ సన్నిహిత సంబంధంఉంది.

ఎందువల్ల ?

ఆంధ్రలో ఇదివరకు కని విని ఎరుగనంతటి మహా సమావేశం ఈనాడిక్కడ జరుగుతూంది. ఉదయం (14 వ తేదీ) బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. ఈనాడు మీకన్నా సగర్వంగా ఛాతీచరుచుకు తిరగగలవారు ప్రపంచంలో మరెవ్వరూ లేరనడం సుస్పష్టం. ఇదంతాచూచి హృదయంలో ఆనందం తాండవించని, ముఖంలో సంతోషం చిందులు తొక్కని రైతుబాబు, రైతుమాత ఆంధ్రలో ఈనాడు ఒక్కరుకూడా ఉండరు.

మీకింత గర్వకారణమయిన, మీకింత పండుగకూర్చిన ఈ మహోత్సవం ఎవరికృషిఫలితం ? మీ కొమాళ్ళ, మీ కొమార్తెల శ్రమఫలితం ఇదంతా ! మీరే కాదు - మీ తరువాత వచ్చే మీ మనమలుకూడా గర్వపడగల ఘనకార్యాన్ని ఈనాడు సాధించారు మీ బిడ్డలు.

## దేశవ్యాపిత కుటుంబం

వారిపాటలు కొన్ని విన్నారు. మీ బిడ్డలొక్కరేకాదు-వారితోబాటు బెంగాల్, బొంబాయి, మహారాష్ట్ర, మలబార్ మొదలయిన ఇతర రాష్ట్రాల్లోని మీ సోదర రైతుబిడ్డలుకూడా ఉత్తేజకరంగా పాడారు. అంటే అర్థం ఏమిటి? మీ ముద్దు బిడ్డలు మీ చుట్టూ ఏకృషిని సాగిస్తున్నారో, ఆదేకృషిని ఇతర రాష్ట్రాల్లోని మీతోడి రైతులబిడ్డలు, వాళ్ళ తలిదండ్రులఎదుట కొనసాగిస్తున్నారు. మీ బిడ్డలు, ఇతర రాష్ట్రాల్లోని ఆ రైతుబిడ్డలు - వీళ్ళంతా ఒక్క కుటుంబంవారు - కమ్యూనిస్టు కుటుంబంవారు. ఇంత పెద్దకుటుంబం ఈ నాడు మరొకటిలేదు. ఆరేండ్లక్రితం ఒకసారి నేను ఆంధ్రదేశానికి వచ్చాను. కాని ప్రజలఎదుటికి వెళ్లలేదు. పార్టీ సభ్యులను మాత్రం కలుసుకొని - ప్రజల నెలా సమీకరించడమో చర్చించు కొన్నాము. ఆరోజుల్లో మీవైఖరి ఎలాఉండేది? మేము సాధించదలచుకొన్న ఆశయం మంచిదే అని మీరు అంగీకరించారు. "స్వాతంత్ర్యం రావడం మంచిదే-కాని దానికోసం మాబిడ్డ లెందుకు కష్టాలుపడాలి: ఎందుకు త్యాగాలుచేయాలి?" ఇదీ అప్పటి మీ ధోరణి. కాని ఈనాడు మీబిడ్డలు సాధించినవాటినిచూచి మీరు గర్వ పడుతున్నారు; వారి త్యాగాలనుచూచి మెచ్చుకొంటున్నారు.

మీ కొమాళ్ళు, కొమార్తెలు ఏవిధంగా మీ కుటుంబసభ్యులో - ఆదేవిధంగా వారు కమ్యూనిస్టుపార్టీ అనే దేశభక్తుల కుటుంబంలోకూడా సభ్యులు. వారు చేసిన ఘనకార్యాలనుచూచి మీరేవిధంగా గర్వపడుతున్నారో ఆదేవిధంగా మేమందరం కూడా గర్వపడుతున్నాం.

## జాతీయోద్యమంలో పుట్టుక

ఆంధ్రలో ఈ కమ్యూనిస్టు కుటుంబం ఎలా పుట్టింది? దీనిపుట్టుక 1930 జాతీయోద్యమంలో. జాతీయ కాంగ్రెసునాయకత్వంకింద స్వాతంత్ర్యం సాధించాలనే ఆశతో ఎందరోయువకులు ఆ ఉద్యమాలలో పోరాడినా స్వాతంత్ర్యంమాత్రం లభించ లేదు. అప్పటి నిస్పృహలో వారికొక ఆశాజ్యోతి కనిపించింది వారిదృష్టి సోవియట్ రాజ్యం వైపు తిరిగింది. అక్కడి ప్రజలు సాధించిన అద్భుత విజ యాలు వీరిని ఉత్తేజపరిచాయి. ఆ విజయాలు ఈ యువకులకు రెండు పాఠాలు నేర్పాయి.

— దేశభక్తులు తమ సోదరప్రజలను సంఘటితపరిస్తేనేగాని దేశానికి స్వాతంత్ర్యం లభించదు.

— దేశభక్తులందరూ ఒకపార్టీలో – కమ్యూనిస్టుపార్టీలో – సంఘటిత మయిననాడే వారు ప్రజలనందరిని సంఘటితపరచగలరు. ఈ రెండుపాఠాలను వారు గుర్తించడంతో మన ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ జన్మించింది. అప్పటి నుండి కమ్యూనిస్టుపార్టీ - ఈ పెద్దకుటుంబం - నానాటికీ పెరుగుతూ వచ్చింది. ఒక్క ఆంధ్రదేశంలోనే ఈ కుటుంబం పదేళ్ళలో 5 000 సభ్యత్వానికి పెరిగింది.

## రైతులే పునాది

ఆంధ్రలో మా తలిదండ్రులు మీరే - రైతులే! అందువల్ల మీలోనే మొట్ట మొదట మా ఉద్యమం ప్రారంభించాము. రైతు ఉద్యమంయొక్క చరిత్ర మీకు నేను వేరేచెప్పనక్కరలేదు. మీబిడ్డలమయిన ఈ 5,000 మంది కమ్యూనిస్టులం మీ మధ్య కృషిచేస్తూ, ఈనాటికి లక్షకుపైగా సభ్యత్వంగల బలీయమైనరైతుసంఘాన్ని నిర్మించాం అంతేకాదు. దేశంఅంతా నిరాశ, నిస్పృహల్లో మునిగిఉన్న ఈనాడు మిమ్మల్ని ఉత్సాహపరచి. మీలో కార్యదీక్షను రేకెత్తిస్తున్నాము. కరువు కాటకాలతో దేశం అల్లకల్లోల మవుతూన్న రోజుల్లో, అధికాహారోత్పత్తి ఉద్యమాన్ని నడిపి ప్రజలకు ఆహారం అందివ్వడానికి కృషిచేస్తున్నాం. ఒక్కఏడాదిలో 12,000 యకరాల బంజరుని మీ కిప్పించాం. మీలో అదివరకే భూములున్నవారికి ఇతర సౌకర్యాలెన్నో కలిగించాం. మద్రాసు ప్రభుత్వం 25 లక్షల రూపాయల ఎరువును అప్పుగా ఇవ్వడానికి ఏర్పాటు చేసింది. దీనిలో 4,25,000 రూపాయల ఎరువును మీ కిప్పించాం. రైతుసంఘమే లేకపోతే, మీ బిడ్డలయిన కమ్యూనిస్టులే లేకపోతే, ఈ 25 లక్షల ఎరువు ఋణంలో అధికభాగం మీకు అందకుండా పోడయేది. ఇంకా నీటిపారుదల సౌకర్యాలెన్నో కలిగించాం.

మిమ్మల్ని ఒక సంఘటితశక్తిగా నిర్మించాం; మీహక్కుల నెన్నిటినో సాధించాం. మీ బిడ్డలనుండి ఇంతకన్న మీరు కోరేదింకేముంటుంది?

## ఇతర రంగాల్లో

మేమింతటితో తృప్తిచెందలేదు. వ్యవసాయకూలీలనుకూడా సంఘటిత పరచడం ప్రారంభించాం.

రైతులకు, వ్యవసాయకూలీలకు ఏమంత పొత్తు ఉండేదికాదన్నసంగతి మీరెరిగినదే! ఇప్పుడు మీ బిడ్డలు వ్యవసాయకూలీలనుకూడా సంఘటితపరిచారు. ఆంధ్రలో 29,000 మంది వ్యవసాయకూలీలు సంఘసభ్యులుగా ఉన్నారు. ఈ నిర్మాణంతో రైతు, కూలీ సామరస్యం పెంపొందసాగింది; గ్రామజీవనంలోనే మార్పు ప్రారంభమయింది.

32A

రైతు మహాసభకు వచ్చిన స్త్రీలలో ఒకభాగం

మాకృషి ఇంకా ఇతరరంగాలకు విస్తరించసాగింది. రైతులకు, కూలీలకు చెందని ఇతర యువకులనుకూడా ఒక నిర్మాణశక్తిగా సంఘటితపరచ పూను కొన్నాం. వాళ్ళకోసం కార్యక్రమం నిర్ణయించుకున్నాం. వాళ్ళ నాకర్షించగల ఆటలు, కళాప్రదర్శనలు, రాత్రిపాఠశాలలు విరివిగా వ్యాపింపజేశాం. వీటిద్వారా 24,000 మంది యువకుల్ని సంఘటితపరచగలిగాం. వీరిలో ఉత్తములు 10,000 మంది ప్రజారక్షణదళంగా నిర్మాణమయారు. ఏసమయంలోనయినా, ఏపరిస్థితిలో నయినా, ఈ దళంవారు ప్రజాసేవకో తమ ప్రాణాలనయినా అర్పించడానికి సిద్ధంగా ఉంటారు.

## దేశభక్తుల మహాసైన్యం

ఒక్కసారి ఈ కృషి నంతటినీ పర్యాలోకించండి. కనబడే దృశ్యంచూడండి! మీబిడ్డలు - 5,000 మంది కమ్యూనిస్టులు అగ్రదళంగా నిలచిఉన్నారు. వారివెనుక 10,000 మంది ప్రజారక్షణదళం - ఆవెనుక 24,000 మంది యువజనసంఘ సభ్యులు - తరువాత 28,000 మంది వ్యవసాయకూలీలు - ఆపైని ఈ నిర్మాణం అంతటికీ మూలాధారంగా ఒక లక్షమందితో రైతుసంఘం। దేశభక్తుల మహాసైన్యం ఈవిధంగా బారులుతీరి వుండడం కనబడుతుంది.

## రైతు స్త్రీలకు జేజేలు !

అంతేకాదు. మేము, మీరు అన్నిటికన్న ఎక్కువగా గర్వపడవలసిన విషయం ఒకటుంది. అదే 20,000 సభ్యత్వంగల మహిళాసంఘం. రైతు స్త్రీల కన్న పట్టణవాసపు మహిళలు ఎక్కువ నాగరికత కలవారని దంభాలు కొడతారు. కాని ఈనాడు జరిగిన ఊరేగింపులో వేంకొలది రైతుస్త్రీలు, చైతన్యం ఉట్టిపడేలా, నాగరికత, అభివృద్ధులకు చిహ్నంగా బారులుతీరి సాగిపోతూంటే ఈ పట్టణ వాసంవారు తెల్లమొగం వేయడం నేను చూచాను.

గత నాలుగు కాంగ్రెసు మహాసభల్లోనూ నేను పాల్గొన్నాను. ఈ రైతుమహా సభకు వచ్చినంతమంది స్త్రీలు ఆ సభల్లో దేనికీ రాలేదని అనుభవంమీద చెబు తున్నాను. మా తండ్రుల్లోను, అన్నదమ్ముల్లోనే కాకుండా, మాతల్లుల్లోను, అక్క చెల్లెండ్రలో కూడా దేశభక్తిని, చైతన్యాన్ని పెంపొందించినందుకు మేమెంతో గర్వపడుతున్నాము.

మీ బిడ్డలమయిన మేము ఇలా అందరినీ సంఘటితపరచుకొని ముందుకు సాగిపోతున్నప్పుడు మా చిట్టితమ్ములుకూడా మా వెంటరావడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. గత 9 మాసాల్లో బాలసంఘ సభ్యత్వం 18,000 కు పెరిగింది.

## కార్మికుల్లో

ఈవిధంగా గ్రామజీవితంలో సర్వతోముఖమైన మార్పు తేవడంతోనే మేము తృప్తిపడలేదు. పట్టణాల్లోని కార్మికరంగానికి కూడా మా కృషిని వ్యాపింపజేశాం. పట్టణాల్లోని ధనికులు కార్మికుల రక్తాన్ని పీల్చి పిప్పిచేస్తున్నారు. ఈ పీడితకార్మిక లోకాన్ని సంఘటితశక్తిగా నిర్మించపూనుకున్నాం.

25000 మంది సభ్యులుగల కార్మికసంఘాలను (ఆంధ్రలోనే) నిర్మించాం. కార్మికరంగానికి మా ఋణం ఈవిధంగా తీర్చుకున్నాం. రైతుబిడ్డలమయిన మేము ప్రజలను ఎలా సంఘటితపరచడమో బొంబాయి, కాన్పూరు, కలకత్తా కార్మికరంగాలనుంచి నేర్చుకున్నాం. నేర్చుకున్న పాఠాలను రైతురంగంలో అమలుజరిపి అనుభవంగడించాం. ఈ అనుభవాన్ని ఉపయోగించుకొని కార్మికరంగాన్ని సంఘటితపరచి ప్రారంభించాం.

## విజ్ఞానరంగం

ఈవిధంగా నిర్మాణకృషి సాగించడమేకాదు మేము చేస్తున్నపని; జాతి యొక్క విజ్ఞానతంత్రులనుకూడా మోగిస్తున్నాము. ప్రభుత్వం మన జాతీయ విజ్ఞానాన్ని అభివృద్ధికానీయకుండా అణచివేస్తూంది. రెండేళ్ళక్రితం మన జాతీయకళలు ఎక్కడా వికసించలేదు. మీ కొమారులు, కొమార్తెలు వీటినిప్పుడు పునరుద్ధరించి, జాతివికాసానికి బలమయిన సాధనాలుగ తయారుచేస్తున్నారు.

ఇప్పుడు మీరుచూసే కళారూపాలు మీరు సృష్టించినవేకావు, మేము కని పెట్టినవీకావు. మన తాత ముత్తాతలు ఈకళారూపాలన్నిటినీ సృష్టించారు. మేము చేసిన పనంతా దేశభక్తిని, చైతన్యాన్ని పెంపొందించే విషయాలను, వస్తువును ఈ రూపాల్లో పెట్టడమే। ఈవిధంగా మన పురాతన కళారూపాలన్నీ ఈనాడు స్వాతంత్ర్యపోరాటంలో బలమయిన సాధనాలుగా మారాయి. వినోదం ఇవ్వడంతో పాటు జాతి నిర్మాణాన్నికూడా కొనసాగించగల దశకు మీబిడ్డలు వీటిని తీసుకు వస్తున్నారు.

## నాడు - నేడు

ఒక విషయం చూడండి. సాయంత్రం (14 వ తేదీ) జరిగిన సభలో నాయకులు చెప్పిన విషయం - ఇప్పుడు (రాత్రి) కళారూపాల్లో బోధిస్తున్న విషయం ఒక్కటే. అదే దేశభక్తి ప్రబోధం। కాని, అప్పటికన్నా ఇప్పుడు ఈ లక్షమంది ప్రజలు ఎక్కువ ఉత్సాహంతో, ఎక్కువ శ్రద్ధతో వింటున్నారు. కారణం ఏమిటి?

సాయంత్రం వ్యక్తులు ఉపన్యాసాలిచ్చారు ఇప్పుడు జాతీయ కళారూపాలు ప్రబోధం సాగించాయి. ప్రజల హృదయాలనిది ఎక్కువగా ఆకర్షించింది.

ఈవిధంగా కమ్యూనిస్టుపార్టీ - మీ బిడ్డలపార్టీ - ప్రజల్లో గాఢమైన దేశభక్తిని అమరజ్యోతిగా రగుల్చుతూంది. గత పదేళ్ళలో ప్రజల్లో వివిధవర్గాలను దేశభక్తియుత ఉద్యమాల్లో సంఘటితపరిచింది. ఈనాటి ఆంధ్రదేశాన్ని పదేళ్ళనాటి ఆంధ్రదేశంతో ఎవరయినా పోల్చి చూడవచ్చు. మునుపటికన్నా ఎక్కువగా నేటి ఆంధ్రదేశం దేశభక్తితో ప్రజ్వలిస్తూంది; మునుపటికన్నా సంఘటితమైవుంది.

## విచారకరమైన విషయం

పార్టీ సాగించిన ఈ కృషినంతటినీ చూచి ప్రతివ్యక్తీ సంతోషిస్తాడని నేను ఆశించాను. ఇది సహజమే. కాని. అలా జరక్కపోవడం చూచి చాల విచారించాను. ప్రజల్లో పార్టీ దేశభక్తిని పెంపొందించిందని ఆంధ్రలో కొందరు కాంగ్రెసువాదు లనుకోవడంలేదు. వారు భావిస్తున్నది తద్వ్యతిరేకం.

నేను ఆంధ్రకువచ్చి ఆరేళ్ళు గడిచాయి. ఇక్కడి కాంగ్రెసు ముఖ్యుల్ని కలుసుకొని అన్నివిషయాలు సాకల్యంగా చర్చించాలనుకొన్నాను. అతిధిగావచ్చిన ఒక దేశసేవకునిగా నన్ను ఆదరిస్తారని ఆశించాను. సహృదయంతో అభిప్రాయభేదాలను చర్చిస్తారని ఎదురుచూచాను. ఇంతకూ భారతీయులం మన నాగరకతా ఔన్నత్యానికి, ముఖ్యంగా అతిధిసత్కారానికి పేరుపొందినవాళ్ళం; కష్టపడి పనిచేసే వారిని ఎంతో ఆదరించడం మన సాంప్రదాయం.

కాని, ఈ కాంగ్రెసు ప్రముఖులు మమ్మల్ని బ్రిటిషు ప్రభుత్వ ఏజెంటులనీ, మాలో దేశభక్తిలేదనీ ఆడిపోశారు.

## ఎవరిని ఆడిపోసినట్లు ?

దేశభక్తియుతమయిన ఒక సంస్థను సామ్రాజ్యవాద ప్రభుత్వపు ఏంజటని అనడం చిన్నవిషయం కాదు. ఈ కాంగ్రెసువాదుల ఆడిపోతలు మమ్మల్నేకాదు- మాకృషిఫలితంగా సంఘటితమైన మీలక్షమంది రైతాంగాన్నికూడా అవమానపరుస్తూంది. మీరు లక్షమంది దేశభక్తులు - ఎవ్వరూ కాదన సాహసించలేరు. మేము ఆంధ్రలో 5,000 మందిమి మాత్రమే. కొద్దిమందిమైన మాచేతిలోపడి మీరందరూ మోసపోతున్నారనడం, మీ వ్యక్తిత్వాన్ని. మీ బుద్ధిని నీచంగా అవమానించడమన్నమాట ।

## కమ్యూనిస్టుపార్టీ అంటే__

ఈ కాంగ్రెసువాదుల్లో కొంతమంది నేటి ఉదయం జరిగిన బ్రహ్మాండమైన ఊరేగింపును చూచివుంటారు. అది చూచినతరువాత వారు తమ అభిప్రాయాన్ని మార్చుకొంటారని అనుకుంటాను.

జాతీయ కాంగ్రెసు మహాసంస్థ ప్రజల్లో రేకెత్తించిన దేశభక్తి నేడు కమ్యూనిస్టుపార్టీలో మూర్తీభవించి వుందన్న విషయాన్ని వీరు గుర్తించాలి. కమ్యూనిస్టుల్ని ఆడిపోయడంలో వారు ఒక సోదర దేశభక్తియుత సంస్థను అవమానించారన్న విషయాన్ని గుర్తించెదరుగాక.

వీరితో తర్క-వితర్కాలు పెట్టుకోవాలని నేనెప్పుడూ అనుకోలేదు. కాని, వీరు కాంగ్రెసుకి, కాంగ్రెసు కార్యక్రమానికి, అపార్థాలు కల్పిస్తున్నారు. కాంగ్రెసు చేసిన కృషి నంతటినీ కమ్యూనిస్టుపార్టీ కొనసాగిస్తూంది, అంతేకాదు. అంతకన్నా ప్రస్ఫుటమైన, అంతకన్నా ఉన్నతమైన ఆశయాలకోసం కమ్యూనిస్టుపార్టీ కృషి చేస్తూంది. మమ్మల్ని ఆడిపోస్తున్న కాంగ్రెసువాదులు మాకృషిని అపార్థం చేసుకుంటున్నారు.

మాకృషిని కళ్లారచూచిన వారెవరయినా మేము సామ్రాజ్యవాద ప్రభుత్వానికి మద్దతు నిస్తున్నామని ఎలా అనుకోగలరా అని నేనాలోచించాను.

మేము చేస్తున్నదేమిటి?

దేశరక్షణ సమస్యకే మేము అన్నిటికన్నా ప్రాధాన్యాన్నిస్తున్నాము. జపాను వ్యతిరేక ప్రచారం సాగిస్తూ, ప్రజల్లో దేశరక్షణదీక్షను బలపరుస్తున్నాము. ఇది బ్రిటిషు ప్రభుత్వానికి మద్దతివ్వడం అనిపించుకుంటుందా?

నిషేధం రాకపూర్వమే కాంగ్రెసు మహాసంస్థ ఫాసిస్టు ప్రతికూల తీర్మానం చేసింది. ఈ యుద్ధంలో రెండు పక్షాలున్నాయని - ఒకటి ప్రజాపక్షం, రెండోది ఫాసిస్టుపక్షం అని గుర్తించింది. ఈనాడు ఆ నాయకులు జైళ్ళల్లో వున్నారు. వారి ఫాసిస్టు ప్రతికూల సాంప్రదాయాన్ని కాపాడుతున్నదెవరు? కమ్యూనిస్టులా? లేక మమ్మల్నాడిపోస్తున్న ఈ కాంగ్రెసు వాదులా?

అగస్టు 9 ఘటనల్ని చూచి ఈ కాంగ్రెసువాదులు అదే స్వాతంత్ర్యపోరాటమనుకున్నారు. కమ్యూనిస్టుపార్టీ అప్పుడే హెచ్చరికచేసింది - ఇది జాతీయోద్యమాన్ని అణచివేయడానికి బ్రిటిషు ప్రభుత్వం వేసిన ఎత్తు అని. మేము చెప్పినది నిజమని గాంధీజీ లేఖలు, సరోజినీదేవి ప్రకటనలు ఋజువుచేశాయి. కమ్యూనిస్టులదా, లేక వారిని ఆడిపోసేవారిదా - దేశభక్తిపంథా? ఎవరిదో మీరే నిర్ణయించండి.

ఇక ఆహారసమస్య చూడండి. కరువురాబోతూందని ముందుగానే గుర్తించి, ప్రజలను, దేశాన్ని కాపాడడానికి అంతా ఏకంకావాలని విజ్ఞప్తిచేశాం. ప్రజల కందుబాటులో ఉండేలా ఆహారపదార్థాల ధరలు నిర్ణయించాలని కోరాము. తిండి దొంగల ఆటలను సాగనివ్వకూడదని తీవ్రప్రచారం చేశాం. ఇదంతా బ్రిటిషు ప్రభుత్వానికి మద్దతివ్వడమేనా?

రాయలసీమలో కరువురాగానే - నివారణోద్యమం ప్రారంభించాం. కృష్ణా, గుంటూరుజిల్లాలనుంచి 26 మంది వాలంటీర్లను పంపించాం. ఇల్లిల్లుతిరిగి డబ్బు, ధాన్యం, బట్టలు పోగుచేసి అక్కడి ప్రజలకు పంపించాం. ఇప్పుడు మమ్మల్ని ఆడిపోస్తున్నవారంతా అప్పుడేంచేశారు? రాయలసీమకు సహాయం చేయడంకూడా బ్రిటిషుప్రభుత్వానికి మద్దతివ్వడమేనా?

బెంగాలు సహాయానికి ఆంధ్రలో వేయిగ్రామాల్లో 10,000 రూపాయలు పోగుచేసి పంపించాం. ఇది ప్రభుత్వానికి సహాయంచేయడమా - లేక ప్రజల్లో అణగిమణగిఉన్న శక్తిని, దేశభక్తిని రగుల్కొలిపి, దానిని సద్వినియోగం చేయడమా? ప్రజల్లో ఇంత భక్తిఉందన్న సంగతి ఈ కాంగ్రెసువాదులకు తెలియదు.

## గాంధీజీ చేయదలచిందే పార్టీ చేస్తూంది

గాంధీజీజాబులను మరోసారి జ్ఞప్తికితెచ్చుకోండని కోరుతున్నాను. తాను బయటికివచ్చి ప్రజలకు సహాయం చేయడంకోసం గాంధీజీ ఎంతో తహతహ వెలిబుచ్చారు. ఆ ఉద్దేశంతో రాజకీయ సమస్యా పరిష్కారంకోసం రాయబారాలు జరపాలని కోరారు. ఏపని చేయడంకోసం మహాత్మాగాంధీ అంత తహతహలాడారో ఆపనినే కమ్యూనిస్టుపార్టీ తన సర్వశక్తులను వినియోగించి, కొనసాగిస్తూంది.

గాంధీజీ జైల్లో ఉండడంవల్ల మాట్లడలేకపోతున్నాడు. కాని శ్రీమతి సరోజినీనాయుడు బయటవుంది. ఆమె సందేశం ఇచ్చింది - కరువు నివారణకోసం అంతా ఏకం కావాలని. ఈ ఐక్యతకోసమే కమ్యూనిస్టుపార్టీ కృషిచేస్తూంది. హైద్రాబాదులో మేముచేస్తున్న పనిని సరోజినీదేవి స్వయంగా చూచింది. ఆ కృషికి తోడ్పడమని తన కుమార్తెను పంపింది. మేము ప్రభుత్వానికి మద్దతు నిస్తున్నా మంటున్నారు ఇక్కడి కాంగ్రెసువాదులు! సరోజినీదేవి ఆశీర్వాదం పొందడానికి మేము తగుదుము కాని, ఈ కాంగ్రెసువాదుల సహకారానికి మాకు అర్హత లేక పోయిందట!

## తమ్మునిలాంటిది

కాంగ్రెసుకోసం - మహాసంస్థ ప్రతిష్ఠను కాపాడడంకోసం ఈ కాంగ్రెసు వాదులకన్నా మేము ఎక్కువదీక్షతో పోరాటంసాగించాం. అనేకమంది కాంగ్రెసు వాదులు మాకృషిని చూచారు; మీ అందరిలాగనే గర్వపడ్డారు. ఇంతకూ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు మహాసంస్థకు తమ్ముడులాంటిది. కాని, ఈకొద్దిపాటి విషయాన్ని కాంగ్రెసువాదులు ఎందుకు గుర్తించడంలేదు? ఒకవైపు తాము కాంగ్రెసుకి అపార్థాలు కల్పిస్తున్నారని, కాంగ్రెసు విధానానికి విరుద్ధంగా పోతున్నారనీ వీరు గుర్తించాలి. మరోవైపు కమ్యూనిస్టుపార్టీ ఆమహాసంస్థ సాంప్రదాయాలను చెక్కుచెదర నీయకుండా కాపాడుతూందన్న సంగతిని గుర్తించాలి.

## ఉభయులకూ తలిదండ్రులయిన మీరు__

ఇంతవరకు జరుపుతూవచ్చిన కృషిని ఇకమీదటకూడా మేము కొనసాగిస్తాం. కాని, చేయవలసిందంతా మేమొక్కరమే చేయలేము. సహాయంకోసం, తమ్ముని లాగా కాంగ్రెసువాదులకు చేయి చాచాము - వారు తోడ్పడ నిరాకరిస్తున్నారు.

మాకూ, వారికి మీరే - ప్రజలే - తలిదండ్రులు. వారు మాచేతి నందు కొనేలా, మాకు తోడ్పడేలా మీరు చేయాలి - మీరే చేయగలరు! మీ కొమారులు, కొమార్తెలు అయిన మేముచేస్తున్న కృషికి మీరు సంతోషిస్తున్నట్లయితే మాఅన్నలు మావిజ్ఞప్తిని, దేశభక్తితో చేస్తున్న విజ్ఞప్తిని. ఆలించేలా చేయాలి.

★ సందేశాలు

అభినందనలు



# అభేద్యమైన ఐక్యత



— అధికారి

భారత కమ్యూనిస్టుపార్టీ తరఫున డాక్టర్ అధికారి కిసాన్‌సభకు సందేశ మిస్తూ, యిలా ఉపన్యసించారు : "రైతాంగసంస్థయైన అఖిలభారత కిసాన్‌సభకు కార్మికవర్గ పార్టీయైన కమ్యూనిస్టుపార్టీ జోహారులర్పిస్తోంది. ఈరెండు సంస్థల మధ్య సోదరభావం ఉంది. ఎందువల్లనంటే, రెండూ ప్రజాసంస్థలే. ఒకవైపు మనదేశ సరిహద్దులలో విదేశీ దురాక్రమణదారులు పొంచికూర్చుని ఉన్నప్పుడు, మరొకవైపు ప్రభుత్వాధికారం అంతా సామ్రాజ్యవాదుల చేతులలో ఉన్నప్పుడు, కిసాన్‌సభ, భారత కమ్యూనిస్టుపార్టీ దేశానికి చక్కనిమార్గం చూపాయి. "దేశ రక్షణకై జాతీయ ప్రభుత్వం అవసరం; దాన్ని స్థాపించాలంటే, జాతీయైక్యతను సాధించాలి." అని దిక్కులు పిక్కటిల్లేటట్లు దేశానికి చాటుతున్నాయి. మన స్వాతంత్ర్యపోరాటం ప్రపంచప్రజల స్వాతంత్ర పోరాటంలో ఒక భాగమని రెండు సంస్థలూ గుర్తించాయి. ఇంతేకాదు. ఆగస్టు ఘటనల సందర్భంలో ప్రజలు చాలా చోట్ల అరాచక చర్యలకు పూనుకొంటూంటే, ఈరెండు సంస్థలూ యెలుగెత్తి ఇది స్వాతంత్ర్య పోరాటంకాదనీ, ప్రజలెవరూ అందులో పాల్గొనవద్దనీ, ప్రకటించాయి.

ఇది పోరబాటు దృక్పథమని అప్పట్లో చాలామంది విమర్శించారు. కాని, 2 సంవత్సరాల తరువాత కిసాన్‌సభ 2 లక్షల నుండి 5 లక్షలకు పెరిగింది. ఈ పాలసీయే సరియైనదని రుజువుచేయడానికి యీ మహాసభే చాలు.... ఈరోజున దేశం యొక్క ఆర్థిక నిర్మాణం అంతా రైతులపై ఆధారపడియుంది. దేశాన్ని కరువు బాధనుండి రక్షించగలవారు మీరే. అధికంగా పంటలు పండించి, ప్రజల్ని పోషించగలవారు మీరే. దేశంలో ఐక్యతను నెలకొల్పగలిగినవారుకూడా మీరే. కనుకనే మీవైపు కాంగ్రెసువాది, లీగ్ సభ్యుడు, ప్రతి దేశభక్తుడు, చూస్తున్నాడు. అన్నిపార్టీలకు చెందిన దేశభక్తులు కిసాన్ సభలోచేరి, దాన్ని బలపరచవలసిందని కోరుతున్నారు. కొందరు కిసాన్‌సభ బలాన్నిచూచి ఓర్చలేక, అనేకవిధాల దుష్ప్రచారం చేస్తున్నారు. రైతుఉద్యమాన్ని విచ్ఛిన్నంచేయాలని చూస్తున్నారు. కాని, అట్టి ప్రయత్నాలన్నీ విఫలం కాకతప్పదు. కమ్యూనిస్టుపార్టీకి, కిసాన్‌సభకు మధ్యగల ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి జరిగే కుటిలప్రయత్నాలుకూడా కొనసాగవు. ఎందువల్లనంటే, రెండు సంస్థలూ యిచ్చే కార్యక్రమమే సరియైన స్వాతంత్ర్య పోరాట కార్యక్రమం. నిన్నటి ప్రజాసంరంభం ప్రపంచంతో సంబంధంలేని ఘటనకాదు. ప్రపంచమంతటా ప్రజలు తమ స్వాతంత్ర్యసిద్ధికై చూపే సంరంభంలో యిదికూడా ఒకభాగం. స్వామీజీ నాయకత్వంకింద కిసాన్‌సభ యింకా బలీయమైన సంస్థగా అయి, భారతదేశ రైతాంగానికి సరియైన కార్యక్రమం యిస్తుందని నమ్ముతున్నాము."

## సాంబమూర్తి

సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకులైన శ్రీ బులుసు సాంబమూర్తిగారు ఉపన్యాస వేదికయెక్కి యిలా ఉపన్యసించారు.

"యుద్ధం మనదేశానికింకా రాకపోయినా, దాని ఫలితాలన్నీ మనం అనుభవిస్తున్నాం. కరువువల్ల లక్షలాది జనం చనిపోతున్నారు. దీనికి కారణం ప్రజావిశ్వాసాన్ని చూరగొన్న జాతీయప్రభుత్వం లేకపోవడమే. పండిన పంటను ప్రజలకు సక్రమంగా పంచిపెట్టగల ప్రభుత్వంలేదు. ఈయుద్ధంలో ప్రజాపక్షంగెలిచి, దుష్టశక్తులు నాశనం కావడానికి బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశ స్వాతంత్ర్యాన్ని గుర్తించకపోవడం అత్యాశ్చర్యకరంగాఉంది. ప్రపంచ ప్రజాస్వాతంత్ర్యం 40 కోట్లమంది భారతీయుల స్వాతంత్ర్యంపై ఆధారపడియుంటుంది. జాతీయప్రభుత్వస్థాపనద్వారా కరువుసమస్య, అంటురోగాల సమస్య, పరిష్కరించబడతాయి. అట్టి జాతీయప్రభుత్వ స్థాపనకొరకు కిసాన్‌సభ పాటుపడుతుందని ఆశిస్తున్నాను."

## యదునందనశర్మ

కామ్రేడ్ యదునందనశర్మ (బీహారు) యిలా చెప్పారు:

"కిసాన్‌సభను కమ్యూనిస్టులు వశపరచుకొన్నారనే నింద ఆధారరహితమైనది; అట్టి ప్రచారాన్ని నేను ఖండిస్తున్నాను కమ్యూనిస్టుల నిఘంటువులో "ఇతరుల నెత్తిపై రుద్దడం" అనే శబ్దం లేనేలేదు. ఈసంగతి బట్టలుమోసే గాడిదకు సహితంతెలుసు. బ్రిటన్, అమెరికా, జర్మనీ మొదలైనదేశాలలో మార్క్సు, లెనిన్‌లపైన, సోషలిజంపైన సామ్రాజ్యవాదు లనేకవిధాల దుష్ప్రచారంచేశారు. కాని, మార్క్సు, లెనిన్ సిద్ధాంతాలుగాని, సోషలిజంగాని, నాశనంకాలేదు. నిందలు వేసిన సామ్రాజ్యవాదులే నశిస్తున్నారు. లెనిన్, "మీరు జీవించాలంటే రైతులతో జీవించాలి; చనిపోవాలంటే రైతులతో చనిపోవాలి" అన్నాడు. కమ్యూనిస్టు సోదరులు యీ సూత్రాన్ననుసరించి కిసాన్‌సభలో పనిచేస్తే, భారతదేశ స్టాలిన్‌అయిన జోషీ నాయకత్వాన మనదేశంలో కార్మిక కర్షక ప్రజారాజ్యాన్ని స్థాపించవచ్చు".

కామ్రేడ్ యదునందనశర్మ స్వామీజీకి కుడిభుజం వంటివాడు. కమ్యూనిస్టు కాడు. కమ్యూనిస్టులతో అనేకపర్యాయాలు వ్యతిరేకిస్తూ వచ్చాడు. అయినా, ఆంధ్రదేశంలో ఇంత రైతాంగం సమీకరించబడ్డం చూచి ముగ్ధుడయాడు. ఈయన ఉపన్యాసం కిసాన్‌సభ — కమ్యూనిస్టు ఐక్యతను బలపరచగలదు."

## స్వామీజీ

స్వామీజీ అంత్యోపన్యాసం యిస్తూ, యిలాచెప్పారు:

"నాకూ, కమ్యూనిస్టు సోదరులకూ, యిటీవల వైమనస్యం ఏర్పడినట్లు ఒక పొరబాటు అభిప్రాయం ఏర్పడింది. అభిప్రాయ భేదాలుంటే ఉండవచ్చు. కాని, సమిష్టిగా చర్చించి, నిర్ణయాలకువస్తాం. అందరం కలిసి చిత్తశుద్ధితో రైతు సంఘానికి సేవచేద్దాం. కమ్యూనిస్టుల ప్రాబల్యం అంటూ చౌకబారుగా నిందలు మోపేవారు సంఘంలోచేరి కమ్యూనిస్టులకంటె ఎక్కువగా సేవచెయ్యడానికి ముందుకు రావాలని కోరుతున్నాను."

బెజవాడ యందలి వివిధ కార్మికసంస్థల తరపున రు. 360 విలువచేసే ఒక రైతు-కూలీ విగ్రహం (వెండిది) సన్మానసంఘానికి కానుకగా యిచ్చారు. ఈవిధముగా పట్టణాలలోను, పల్లెలలోను. నివశించే కష్టజీవుల ఐక్యత ప్రకటించబడింది.

# దేశభక్తిప్రచారానికి కళారూపాలు సాధనాలవాలి!



ఇసుకవేసినా రాలనిజనం. చీమ చిటుక్కుమనడంలేదు. చల్లని పిల్లగాలి ప్రేక్షకుల్ని జోకొడుతోంది. చీకటి తెరలను చీల్చుకొంటూ చంద్రుడు త్వరపడు తున్నాడు. మన వైజ్ఞానిక ప్రదర్శనాలను ఎప్పుడు చూద్దామాఅని. ప్రజలూఅంతే! దూరప్రయాణంచేసిన బడలిక వాళ్ళ ముఖాల్లోలేదు. ఊరేగింపులు, ప్రదర్శనాలు, ఉపన్యాసాలు, జనుల కోలాహలం మూలంగా బుర్రవేడెక్కినట్లు వారిలో కన్పించ లేదు. ఏదోచూడాలని, ఏమో వినాలని కుతూహలం. ఆతృత, ఆనందం ఆ లక్ష మంది ప్రజల్లోనూ కన్పించుతున్నాయి.

"ఎగురవేయి భారతభువిపై" అంటూ జండాపాట పాడారు. కోటిగొంతులు కలిపి తమ త్రైవర్ణ జండాకు జయధ్వానాలు చేస్తున్నట్లు అనిపించింది ఆ సమిష్టి గానం. ప్రమత్తులైయున్న భారతప్రజలను మేల్కొల్పుతూ 'జాగ్రే' అంటూ బొంబాయి వైజ్ఞానికదళం ఒకపాట పాడింది. వసంతకాలానంతరం వచ్చే పంటను భద్రపరచుకోమని రైతును హెచ్చరించుతూ యు. పి. వైజ్ఞానికదళం ఒక పాట పాడింది. బెంగాల్‌దళం ఎర్రజండా పాటను సమిష్టిగా పాడింది.

హర్షధ్వానులమధ్య జోషీ వేదికనెక్కాడు. ప్రాచ్యకళాస్వరూపాలను తీసు కొని, వాటికి కొత్తకొత్త భావనాపుష్టినిచ్చి, కమ్యూనిస్టులు పారంపర్యంగా వస్తున్న మన కళలను, విజ్ఞానాన్ని ఎలా నిలబెడుతున్నారో సంగ్రహంగా చెప్పాడు. తర్వాత జోషీ కమ్యూనిస్టుపార్టీ పంథా వివరించాడు. దీనితర్వాత వైజ్ఞానిక ప్రదర్శ నాలు ప్రారంభమయ్యాయి.

"అల్లాకేనాం - హల్లాకేనాం" అంటూ ఇద్దరు ఫకీరులు వేదికపైకెక్కారు. ప్రస్తుతం దేశంలోని కరువు ప్రతిష్టంభనలను వివరించిన తర్వాత "హిందూ-ముస్లిం ఏక్‌హో" అంటూ ఫకీరులు నిష్క్రమించారు. "హిందూ-ముస్లిం ఏక్‌హో"అంటూ ప్రేక్షకులు తిరిగి జవాబిచ్చారు. ఐక్యతకై ప్రజలెంత హహాతహపడుతున్నారో ఈ నినాదం ఒక్కటే తెల్పింది. తర్వాత నెమిలిపింఛాలతో చెంచువాళ్ళు తయారు!

రైతు కర్తవ్యాన్ని ప్రబోధించుతూ చెంచీతపాటపాడారు. ఈరెండు అంశాలలోను వేష, భాషలు, బహుచక్కగావున్నాయి. తమ దైనందిన జీవితసమస్యలను ఇంత చక్కగా, ఇంతతేలికగా, ఇంతసూటిగా రైతుపుత్రులు, కూలిబిడ్డలు ప్రదర్శించుతూంటే ప్రేక్షకులు పొందిన ఆనందాన్ని వర్ణించడానికి వీలులేదు. ఇంతలో బొంబాయి దళం వేదిక ఎక్కింది. బెంగాల్ కరువునుగురించి "పోవ్డా" (మన బుర్ర కథలాంటిది) పాడారు. భాష అర్థంకావడంలేదు. కాని భావం అర్థం అవుతూనే వుంది. బెంగాల్ కరువు అనగానే పగలుచూచిన బెంగాల్ కరువు దృశ్యాలు జ్ఞప్తికి వచ్చాయి. ఇందాకటినుండి ఉరకలు పెడుతున్న సంతోషం యిప్పుడులేదు. ఆలోచనలో పడ్డారు. తలలూపారు. ఏంచెయ్యాలి? ఏమనుకొంటున్నారో తెలియదు. "మాస్కో పొలిమేరలోన" అన్న కోలాటంపాట మళ్ళా ఈ ప్రపంచంలోకి రప్పించింది. ప్రజల్ని ఫాసిస్టు రాక్షసులనుండి ప్రపంచాన్ని కాపాడుతున్న రెడ్ఆర్మీ విజయాలను ఇంత ప్రతిభావంతంగా చిత్రించిన కవిగాని, ప్రదర్శించిన ప్రదర్శకులుగాని ఇదివరకెన్నడూ లేరు.

లక్షలకొలది ప్రాణాలర్పించిన రెడ్ఆర్మీ చరిత్రలో ఒక మహత్తర బాధ్యతను నిర్వర్తించింది. కాని యుద్ధంలో పాల్గొనకుండానే మన బెంగాలులో 50 లక్షలమంది తిండికోసం మలమలమాడి చనిపోవడమా? — అని ఆలోచనలో పడివున్న ప్రేక్షకులకు బెంగాలుదళం "మృత్యునృత్యం" ప్రదర్శించింది.

కరువువాతపడ్డ బెంగాలు రైతు కుటుంబం అది. భార్యా, భర్తలువారు. "ఆకలి! ఆకలి!!" అంటూ యాచనకు బయలుదేరుతారు. ఒక్క రాగిడబ్బు దొరికేసరికే పట్టరాని సంతోషం వస్తుంది. ఆనందంతో పిచ్చిఎత్తిపోతారు. కాని ఆ రాగిడబ్బులకు తిండిదొంగ బియ్యం ఈయడు. తనుదాచిన బస్తాలను, తన కొచ్చే లాభాలను లెక్కపెట్టుకొంటాడు. అంతే! ఆకలివాతబడి భర్త మరణిస్తాడు. మృత్యువు వస్తుంది. భార్య మృత్యువుతో పోరాడుతుంది. కాని చివరకు ఆమె కూడా బలికాక తప్పలేదు. ఈ నృత్యంలో పాల్గొన్న పానూపాల్, ఉషాదేవి అత్యద్భుతంగా నటించారు. ఆకలిబాధ, డబ్బులు దానంచేసినప్పుడు సంతోషంతో పిచ్చెత్తిపోవడం, తిండిదొంగ బియ్యం ఈయనిరాకరించినప్పుడు దైన్యం, మృత్యువుతో పోరాడేటప్పుడు ఘర్షణ—ఈభావాలన్నిటినీ అద్భుతంగా ప్రదర్శించారు. బెంగాల్ క్షామచిత్రాన్ని ఇంకెన్నడూ మరువనట్లుగా హృదయాలకు హత్తుకొనేటట్లు చేశారు. బెంగాల్ క్షామనివారణకు వెంటనే గలగలమని డబ్బులు రావడం ఇది ప్రజలకెంత నచ్చిందో తెలియజేస్తుంది. తక్కిన కార్యక్రమానికి భంగం రాకుండేందుకుగాను, ఆ విరాళాలను తీసికోడాన్ని ఆపివేయవలసి వచ్చిందికూడా!

తర్వాత ఆంధ్రదళం బెంగాల్ కరువుపైన ఒకపాట పాడారు. కష్టజీవి బుర్రకథ చెప్పారు. జమీందారీ విధానంక్రింద రైతులుపడే అవస్థలనుగురించిన కథ అది. జమీందారీ రైతుల కష్టాలువిన్న ప్రేక్షకులకు, తేయాకుతోటల్లోని కార్మికుల కష్టాలను బెంగాల్ దళం నృత్యంద్వారా, పాటద్వారా చూపించింది.

మొదటిరోజు (14 వ తేదీ) వైజ్ఞానిక ప్రదర్శనా లీవిధంగా ముగిశాయి.

రెండవరోజు కార్యక్రమంలో బెంగాలు, బొంబాయి, కేరళ, తమిళనాడు, పంజాబు దళాలు పాల్గొన్నాయి. మొత్తంమీద 17 అంశాలను ప్రదర్శించారు. లాఠీలకు, జైళ్ళకు, ప్రవాసాలకు గురియైన పంజాబు వృద్ధసింహాలు మొదలుకొని, బాలసంఘాలవరకు ఇందులో పాల్గొన్నారు.

మొదట తమిళనాడుదళం బాలసంఘం పాట (బెంగాలు కరువుమీద) పాడింది. తర్వాత ఉర్దూ మహాకవి, కార్మికనాయకుడూ అయిన మక్దుంవ్రాసిన "జంగ్ హై జంగ్ ఆజాదీ" ప్రేక్షకుల నుర్రూతలూగించింది. మక్దుం ఆంధ్రుడని తెలియగానే మరింత ఉప్పొంగిపోయారు. రైతుల గమ్యస్థానాన్ని తెలియజేస్తూ పాడిన పడవపాటకు ఒళ్లు మరచిపోయారు చూచేవారంతా.

మళ్ళా బెంగాల్ దళం నృత్యం చేసింది. "గంభీరనృత్యం" అని దానికిపేరు. 1943 లో బెంగాల్ కరువును చిత్రిస్తూ హిందూ - ముస్లిం సోదరులిద్దరు తమ దీన గాథ చెబుతారు. భార్యని, పిల్లల్ని అమ్ముకోవడం, తినక తినక ఎన్నాళ్ళకో తిండి తినడంవల్ల జీర్ణించుకోలేక కలరారావడం, డాక్టర్లు లాభంలేదని చెప్పడం, కుటుంబాలు విచ్ఛిన్నమవడం — ఈ విషాదగాథనంతా నృత్యంద్వారా చెప్పారు. హృదయాలను దూసుకుపోయే ఆ నృత్యం చూచాక, పాటకు అర్థమే తెలిసివుంటే, ఇంకెంతగా బెంగాల్ చిత్రం మనస్సుకు నాటుకుపోయేదో ననిపించింది.

తర్వాత పంజాబు వృద్ధసింహాలు లేచాయి. పదాడంబరంలేకండా, సూటిగా అర్థమయ్యే శైలిలో ప్రశ్నోత్తరాల రూపంలో ఒకపాట పాడారు. భాషతెలియక పోయినా, పాడేవారిని, వారికి వంతకలిపేవారిని చూడగానే భావం అరటిపండు ఒలిచి అరచేతిలో పెట్టినట్లనిపించింది.

పిమ్మట మలబారు దళం ఒట్టంతుళ్ళల్ (మన భరతనాట్యంలాంటిది) నృత్యం గావించింది. దక్షిణాదిలో మన కూచిపూడి భరతనాట్యం, కేరళలో కథాకళి మొదలైనవి అఖిలభారత ప్రశస్తిగన్న ప్రాచీన కళాస్వరూపాలు. కేరళదళం ఆనృత్యంలో ఎర్రజండాపాట, భారత రైతాంగ జీవితాన్ని వర్ణించింది. మంచి హంగూ, ఆయాసం రాకుండా కొద్దిభాగం మాత్రం ప్రదర్శించివుంటే ఎంతో బాగుండేది.

మరాఠీలో ఐక్యతమీద బొంబాయిదళం ఒక ఉత్తేజకరమైన గీతాన్ని పాడింది. కాంగ్రెసు - లీగ్ ఎర్రజండాలను కలుపుతూ పాడినప్పుడల్లా హర్షధ్వానాలు చెలరేగాయి.

తక్కిన ప్రదర్శనాలలో ఆంధ్రదళంవారి వీధిభాగవతం, రాజారావుగారి సుత్తీ కొడవలి నృత్యం, లంబాడీడ్యాన్సు, భజన అమితంగా ఆకర్షించాయి. వీధిభాగవతంలో హిట్లరు కోతలు - అరపులు, ముస్సోలినీ బోజోల ఏడ్పులు, మరపురానివి. లంబాడీడ్యాన్సును బాలికలైనా ఎంతో ప్రతిభావంతంగా ప్రదర్శించారు. గుజరాతి గర్బనృత్యాన్ని జ్ఞప్తికి తెస్తోందన్నాడు ఒక బొంబాయి ప్రతినిధి. మహిళలు బుర్రకథ చెప్పడం వింతగాకన్పించింది మహిళాలోకానికి.

తమిళరాష్ట్ర దళంలో భక్తి పారవశ్యంతో చిందులువేసిన కుంటివాడు మద్రాసు కమ్యూనిస్టు కుట్రకేసులో ప్రముఖుడైన రామమూర్తి అనీ; కేరళ నృత్యానికి హంగుదారులలో మద్రాసు కమ్యూనిస్టు కుట్రకేసులోని కేంశీయన్ ఉన్నాడనీ తెలియజెప్పగానే ప్రజలంతా విస్తుపోయారు.

ఆఖరున ఒక్కమాట చెప్పాలి. బినయరాయ్ (బెంగాల్) రచించిన "మైబుఖాహుం" (ఆకలి) అనే నాటకం అత్యద్భుతంగా ప్రదర్శించబడింది. కరువు రాక్షసిపాలిటబడ్డ ఒక రైతు, ఒక కూలీ, ఒక చిన్న వర్తకుడు, ఒక స్త్రీ, పడేబాధలను ఇందులో వర్ణించారు. ఆకలితో చావనున్న వారికి ఒకభక్తుడు విదల్చిన నాల్గురాగిడబ్బులకే వాళ్లెంతో సంతోషంతో పిచ్చివాళ్ళయిపోతారు. కాని తిండి దొంగవాళ్ళకు బియ్యం అమ్మడు. నిస్సహాయస్థితిలో నున్నవాళ్ళను, పంచమాంగదళంవాడు లూటీలకు పురికొల్పుతాడు. లూటీవల్ల అన్నం దొరకలేదుసరిగదా లాఠీలు, తుపాకిగుళ్లు లభించాయి.

కరువును ఆధారంచేసుకొని స్త్రీల శీలాన్ని అపహరించే తుచ్ఛుడొకడు వస్తాడు. తనబిడ్డ ప్రాణం నిలబెట్టుకోడానికి ఒకరాత్రి ఆ స్త్రీ తన మానాన్ని అమ్ముకొంది. కాని బిడ్డప్రాణం పోయింది. తన మానమూ పోయింది. ఇక్కడ ఉండవద్దు పొమ్మని బ్రతిమాలుతుంది. మరొక అనాథ స్త్రీ వెంటబడి ఆ తుచ్ఛుడు పోతాడు. తర్వాత జపాను బాంబుల బాధలకు గురియౌతారు. చావగా మిగిలినవారు మహిళా ఆత్మరక్షణ సమితి సహాయాన్ని పొందుతారు. ఈ నాటిక చూచిన తర్వాత రాతిగుండెకూడా కరిగిపోతుంది. ఈ నాటికలో ఉషాదేవి అభినయచాతుర్యాన్ని ప్రశంసించని వ్యక్తిలేదు.

ఈ వైజ్ఞానిక కార్యక్రమంవల్ల ప్రజలు పొందింది వట్టి వినోదం మాత్రమే కాదు. ప్రతి అంశంలోను ప్రదర్శనంతోపాటు ప్రేక్షకుల హృదయ తంత్రులు స్పందించాయి. ఎర్రజెండాకు సగర్వంగా హర్షధ్వానాలు చేశారు. హిట్లర్ పరాభ

వానికి కడుపుబ్బ నవ్వారు. రెడ్ఆర్మీ విజయాలకు కృతజ్ఞతాపూర్వకంగా జోహారులు చేశారు. బెంగాల్ కరువు నృత్యాలు - నాటికలు చూచినప్పుడు కంటతడి పెట్టారు.

వైజ్ఞానిక కార్యక్రమం ప్రజలలో గాఢమైన దేశభక్తిని రేకెత్తించడానికి ఉద్దేశించబడింది. ఆంధ్రదేశంలో దేశభక్తి సందేశమివ్వడానికి వైజ్ఞానిక ప్రదర్శనాలు ఎలా ఉపయోగించుతున్నాయో ఇతర రాష్ట్ర ప్రతినిధులు దీనివల్ల తెలిసికొన్నారు. అలాగే ఇతరరాష్ట్ర ప్రదర్శనాలవల్ల మనరాష్ట్ర ప్రజలు ఎన్నోవిషయాలు నేర్చుకొన్నారు. ముఖ్యంగా బెంగాల్ క్షామచిత్రం ఇదివరకు ఇంత స్పష్టంగా మన ప్రజల కనులకు కన్పట్టలేదు.

బెజవాడ వార్ టెక్నీషియన్లు రైతాంగంతో తమ కార్మిక ఐక్యతను తెలియజేయడానికిగాను ఒక కప్పును బహూకరించారు. వైజ్ఞానిక ప్రదర్శన దళాలలో ఉత్తమ దళానికి దీనిని ఈయమని కోరారు. కొన్ని సామాన్యలోపాలున్నా, మన ప్రజలలో గాఢంగా చొచ్చుకొనిపోయిఉన్న ప్రాచ్యకళా స్వరూపాలను ఏరి చక్కగా ప్రదర్శించినందున ఆంధ్రదళానికి ఈ బహుమానం వచ్చింది. దువ్వూరు బలరామిరెడ్డిగారిచ్చిన మరొకకప్పు వైజ్ఞానిక దళాలను బాగా తర్ఫీదుచేసిన రైతు సంఘానికిగాను ఉద్దేశించబడింది. అది ఆంధ్రరాష్ట్ర రైతుసంఘానికి వచ్చింది. ఆహ్వానసంఘం కొన్ని ప్రత్యేక బహుమతులను ఇచ్చింది. ప్రదర్శనాలలో బాగా నటించిన కామ్రేడ్ ఉషా (మొదటిబహుమానం) కామ్రేడ్ పున్నయ్య, కామ్రేడ్ రాజారావు ఈ బహుమతులను పొందారు. ఇతర బహుమతులలో బెంగాల్‌దళానికి 1,000 రూపాయలు, బెంగాలు క్షామనివారణకుగాను ఈయబడింది. అమృతలూరు బాలసంఘానికి, మంచికలపూడి భజన సమాజానికి, గుంటూరు మహిళాదళానికి, బెంగాల్, మలబారు, బొంబాయి దళాలకు ఇంకాకొన్ని ప్రత్యేక బహుమతులు ఈయబడినాయి.

# కని, విని ఎరుగని : వలంటీర్ నిర్మాణం

★ కొండపల్లి సీతారామయ్య

ఫిబ్రవరి 20 వ తేదీ వచ్చేసింది. మహాసభ నిర్మాణ ప్రయత్నాలు అనేక దుస్సంఘటనలవల్ల వుత్సాహంగా సాగడంలేదు. కేవలం 24 దినాలు మాత్రమే వుంది. మహాసభ ప్రయత్నాలు గుర్తుకొస్తే ప్రతివాడికి గుండె జలదరిస్తోంది. వ్యవధిలేదు. బ్రహ్మాండమైన ప్రయత్నాలు ముందున్నాయి. మహాసభ జరిగే తారీఖు మారిస్తే మంచిదేమోఅని కొందరు కామ్రేడ్సు సలహాయిచ్చారు. 10,000 మంది ప్రజాసైనికులు పూనుకున్నపని సాధ్యంకాకపోతుందా అని పళ్ళ బిగువున సమాధానం చెప్పుకున్నాం. 25 వ తేదీకి కృష్ణానుండి, గుంటూరునుండి 60 మంది ప్రజారక్షణదళ సభ్యులు మహాసభ నిర్మాణానికి హాజరయారు. పని ప్రారంభమైంది.

## ఎంతవుత్సాహం !

26 వ తేదీ రాత్రి, 9 గంటలయింది. వలంటీరు మిత్రులను చూడడానికి మహాసభ స్థలానికివెళ్ళాను. చీకటిగావుంది. సరియయిన దారితెలియక వాసాలకు అడ్డంపడ్డాను. 'ఎవరండీఅది' అనే కేకతో బేటరీలైటు నామీద పడింది. కామ్రేడ్ వలంటీరు సెంట్రీడ్యూటీలో వున్నాడు. ఎంత జాగరూకత ! ఆ కామ్రేడ్ దారి చూపించివెళ్ళాడు. క్రిందటిదినం మైదానం - యీ రాత్రికి అప్పుడే 3 పందిళ్లు తయారైనాయి. నిజంగా ప్రజాసైనికులనిపించారు. "వంతులువేసుకొని పనిచేశాం, కామ్రేడ్!" అంటూ ఒక వాలంటీరు వుత్సాహంతో అన్నాడు. ప్రజాసేవ లక్ష్యంగా లేని వాళ్ళు యింతపని చేయగలరా అనేగర్వం అతని ముఖంలో కన్పించింది. మహాసభ ప్రయత్నాలు పూర్తికావనే భయం కొంచెం తగ్గింది. అంత కార్యదీక్షతో పనిచేస్తున్న ప్రజా సైనికులనుచూస్తే పని అసంభవమనుకునేదెట్లా ?

## వలంటీరుకమిటీ మీటింగు

రైతుమహాసభ ఆహ్వానసంఘ సభ్యులచే ఎన్నుకోబడ్డ వలంటీరు కమిటీ సమావేశం జరిపాం. మహాసభ నిర్వహణానికి పూర్తిప్లాన్ తయారుచేశాం. మొదట్లో నిరుత్సాహంఉన్నా, వలంటీర్లకృషి అందరినీ ఉత్తేజపరచింది. మార్చి 5 కే నిర్మాణ ప్రయత్నం పూర్తిఅవుతుంది, తప్పకుండా అన్నాడు కామ్రేడ్ రాజేశ్వరరావు, మార్చి 10 కి 3,500 మందిని, మార్చి 14 కు మరి 3,500 మందిని వాలంటీర్లను తీసుకొని రావాలనీ; ఎక్కువ శిక్షణ యివ్వాల్సిన అవసరంవున్న పనులకు 10 వ తేదీకి వచ్చేవారిని ఉపయోగించాలనీ, మిగిలిన పనులకు 14 వ తేదీకి వచ్చేవారిని ఉపయోగించాలనీ కమిటీ తీర్మానం. తలా ఒక జిల్లాకు బయలుదేరాం!

## రైతునగర్

మార్చి 9 వచ్చింది. నావంతు కార్యక్రమం పూర్తిచేసుకొని బెజవాడచేరాను. నాకంటే ముందువచ్చిన కామ్రేడ్సంతా రైతునగర్ నిర్మాణాన్నిచూచి మురిసిపోతు న్నారు. సాయంత్రం రైతునగర్‌కు వెళ్ళాను. ఏం సంరంభం! వలంటీరు కామ్రేడ్సంతా కోలాహలంగా పందాలు వేసుకొని పందిళ్ళు నిర్మిస్తున్నారు. అతివే గంగా పని జరుగుతోంది అనే ధీమాతో ఆఫీసులో జమాఖర్చులు వ్రాస్తున్న కామ్రేడ్ దాసు (రాష్ట్ర యువజన సంఘ ఆర్గనైజరు) "నిముషాలమీద పని జరుగు తోందిచూడు!" అంటూ వుత్సాహంతో కరస్పర్శజేశాడు. ఒకమఠా టాంకు కట్టడా నికి ఇసుక మోస్తోంది. ఒక దళం గేటుకు అవసరమైన యేర్పాట్లు చేస్తోంది. ప్రతి కామ్రేడ్ తన పనిలో నిమగ్నుడై వున్నాడు, బాధలు లేపలేక అవస్థపడుతున్న ఒక యువక వలంటీరుపై నాదృష్టిపడింది. చాలా అలసట జెందాడు. 'కాసేపు కూర్చో కామ్రేడ్,' అన్నాను. "నేకూర్చుంటే మాదళంవంతు ఎలా పూర్తి అవు తుంది?" అని సమాధానం.

## వలంటీర్ల ఓర్పు

9 వ తేదీ రాత్రే వలంటీర్ కమిటీ అంతా రైతునగర్‌లో మకాం పెట్టాం. 10 వ తేదీ అంతా వలంటీర్లు ప్రవాహంగా వస్తూనేఉన్నారు. వలంటీర్లకని నియ మించిన పందిరి ఒకటి నిండింది, కాని అనుకున్నంతమంది రాలేదు. 1,200 మంది మాత్రమే వచ్చారు. ఎందుకనిరాలేదా అనే ఆలోచనలో పడ్డాం. గుంటూరుజిల్లా పొగాకు మార్కెటింగు ఎన్నికలవల్ల అనుకున్నంతమంది వలంటీరు కామ్రేడ్సు ఆజిల్లానుండి రాజాలక పోయారన్నాడు కామ్రేడ్ ప్రసాద్. (రాష్ట్ర యువజన సంఘ

ఆర్గనైజర్) ఆ ఎన్నికలలో జిల్లా రైతుసంఘ అభ్యర్థులను, రంగాముఠా, కొందరు వర్తకులు, కొంతమంది స్వార్థపరులు - అంతాగలిసి ఓడించాలని తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నారు. మార్చి 14, 15 రైతుమహాసభ గనుక, దానికి వెళ్ళిన రైతు సేవకులు తిరిగిరావడం సాధ్యంకాకుండా చేయాలనుకున్నాడు ఎన్నికోద్యోగి. ఎన్నికలను 18, 19 తేదీలనుంచి, 16, 17 తేదీలకు మార్చాడు. అంచేత కొంత మంది వాలంటీర్లను నిలిపివేయవలసి వచ్చింది. కామ్రేడ్ రాజేశ్వరరావు ఆలోచనలో పడ్డాడు. నిర్మాణం 5 వ తేదీకే పూర్తి అవుతుందనుకున్నాం; కాని అదనంగా ఎన్నో పనులు రావడంమూలంగా పూర్తికాలేదు. "3000 మందైనా రాకుంటే నిర్వ హించడం చాల కష్టమే" అంటూ పెదిమలు విరిచాడు కామ్రేడ్ తమ్మారెడ్డి. ఇంత లోనే యేమీ ఫరవాలేదు అని అభయహస్త మిస్తున్నారా అన్నట్లుగా, "రైతుసంఘా లకు జై" అంటూ దిక్కులు మారుమ్రోగే నినాదాలు వినిపించాయి. ఉత్సాహంగా అందరంలేచాం. దారులుదీరి, నినాదాలిచ్చుకుంటూ వస్తున్నారు వాలంటీర్లు. అది రేపల్లె దళం. తాలూకా వాలంటీరు కెప్టెన్ ముందు వున్నాడు. ఇంకా ఎంతమంది వస్తున్నారు కామ్రేడ్ అని ప్రశ్నించాను. "పడవలేక చాలమంధిరాలేదు. కొంత మంది రేపు రైలుకు వస్తామన్నారు. ఎవరికివారు తేలికమార్గాలు వెదుక్కోవడం తప్పనిసరి అయినందువల్ల ఎక్కువమంది రాజాలకపోయాము. వచ్చినవాళ్ళలో కూడ కొందరు రైళ్ళమీద, కొందరు పడవలమీద, కొందరు నడకను రావడంవల్ల ఒక పూరువారందరూ ఒక దళంగా రావీలులేక పోయింద"న్నాడు. ఆ కామ్రేడ్ మాటలు వింటున్న మరో గుడివాడతాలూకా కామ్రేడ్ "మా తాలూకాలో మినుము తీతలు ముమ్మరంగా వున్నాయి. అందులో ముసురుకూడాపట్టి హడావిడిచేస్తోంది, లేకుంటే ఇంకా చాలమంది వచ్చేవాళ్ళు కాని, వాళ్ళంతా 14 వ తేదీకి తప్పకవస్తా ర"న్నాడు. మొత్తంమీద పైకారణాలవల్ల వలంటీర్లు 3,500 మంది రావడం కష్టమే ననిపించింది.

## వలంటీరు విధులు

మరునాడు ఉదయం వలంటీర్ల సమావేశం జరిగింది వలంటీర్ల విధులు కామ్రేడ్ రాజేశ్వరరావు చదివి, వివరించి చెప్పాడు. వాలంటీర్లు వంట, ఆరోగ్యం, కాపలా, ఊరేగింపులు, బహిరంగసభలు వగైరా, స్త్రీలు మొదలైన 5 శాఖలుగా విభజింపబడ్డారు. వివిధశాఖలు, ఆ శాఖల బాధ్యులపేర్లు, వలంటీర్లకు పరిచయం చేశారు. ఆరోజునుంచి వలంటీర్లందరు శాఖలవారీగా విడిపోయి పనిచేశారు. ఈ వివిధశాఖల వలంటీర్లకు వేర్వేరుపందిళ్ళు ప్రత్యేకించబడినాయి. ఆ పందిళ్ళలో ఏగ్రామదళానికి ఆదళం కందాయతాడుతో కొంతచోటు అడ్డుగట్టుకొని ఇల్లులా చేసుకు

న్నారు. స్థలంచాలకపోవడంచేత, అలాగే ఇరుక్కొని పండుకొనేవారు. ఈ పందిళ్ళనుచూస్తే నాకు బొంబాయిలో కార్మికులుండే ఛాల్సు గుర్తుకువచ్చినాయి. పైశాఖలకు ఆయాపందిళ్ళలో వేర్వేరు ఆఫీసులు పెట్టబడినాయి. ఆఫీసుల పనిని తనిఖీచేయడానికి కేంద్ర వలంటీరు ఆఫీసు పెట్టబడింది.

## విశ్రాంతి లేకుండా పనిచేశారు

వచ్చినతరువాత ఒక్క పూటకూడ విశ్రాంతి లేకుండా పనిచేశారు. 5,000 మంది భోజనం చేసేందుకు సరిపోయే పందిరి నిర్మించారు లెక్కలేనన్ని పాయి ఖానా దొడ్లు కట్టారు. ఎన్నో మరుగుదొడ్లు తయారుచేశారు. ఇంటివద్దనుండి బయలుదేరిన తర్వాత ఒక్కనిముషంకూడ విశ్రాంతిలేదు. మొట్టమొదట అంచనా లేకపోవడం మూలంగా ఎంత హడావిడిగాచేసినా 13 వ తేదీ వరకు కాన్ఫరెన్సు నిర్మాణానికి సంబంధించిన పని వుంటూనేవచ్చింది.

## వలంటీరు నిర్మాణం

12 వ తేదీ రాత్రికే ప్రదర్శనశాల తయారైంది. జనం వచ్చేవాళ్ళు పోయే వాళ్లతో రైతునగర్ కళకళలాడుతోంది. 13వ తేదీ ఉదయం ఐదుగంటలకు సైము "అయిందిలెండి" అని కేకవేసింది వెంట్రప్రగడ మిలిటరీ బ్యాండు. అన్ని పందిళ్ళలోని వలంటీర్లు హడావిడిగా లేచి కాలకృత్యాలు తీర్చుకోటానికి పోతు న్నారు. ఇంకాచాల చీకటివుంది. ఆరుబయట పడుకున్న మనుష్యులుకూడలేచి హడావిడిగా కాలకృత్యాలు తీర్చుకుంటానికి బయలుదేరి పందిళ్ళ కడ్డంబడ్డారు. ఇది కాదండోయ్ దారి అంటూ సెంట్రీవచ్చి దారిచూపెట్టాడు. బయటికివచ్చి టాంకు వద్దనీళ్ళు ముంచుకోవడానికి వెళ్ళాడు ఒకాయన, 'దొడ్డికి వెళ్ళేందుకు యీ నీళ్ళు కాదండి' అంటూ ఒక వలంటీరు ప్రత్యక్షం. దొడ్డికి వెళ్ళివస్తున్నాను. పాయిఖానా దొడ్లవద్దనున్న నీళ్ళ కొళాయిదగ్గర నల్గురు వలంటీర్లు వున్నారు. ఇద్దరు దొడ్లలోకి మార్గం చూపెడుతున్నారు. ఇద్దరు నీళ్ళదగ్గర వున్నారు. "ఈనీరు క్లోరినేటు చేయలేదండోయ్ - నోట్లో పోసుకోవద్దు." అని విసుగులేకుండా చెపుతున్నారు. ఈ శ్రద్ధచూచి వుప్పొంగని వారెవరుంటారు? "ఇందుగల డందులేడని సందేహము వలదు" అన్నట్లు ప్రజలను ప్రతి చిన్నవిషయంలోను కంటికి రెప్పలా కాచారు.

భోజనాలవద్దగాని, కావలాలోగాని, మీటింగులో సర్దడంలోగాని, డ్యూటీలో వారికి విశ్రాంతి ఇవ్వడానికి అదనంగా వలంటీర్లు లేకపోయారు. అందువల్ల వలం టీర్లు రెట్టింపుపని చేయాల్సివచ్చింది. అయినా వలంటీర్లు ఓర్పుతో బాధ్యతను నిర్వహించారు.

## ఎవరెవరు వలంటీర్లుగా వచ్చారు ?

వలంటీరు ఆఫీసులో కూర్చుంది భవిష్యత్కార్యక్రమంపై ఆలోచన సాగిస్తున్నాం. "నాకేదైనా పనియివ్వండి" అంటూ వచ్చాడు ఒకాయన. 60 ఏండ్లుంటాయి గడ్డం మాసివుంది. మాసిపోయిన లుంగీ, చిరిగిన చొక్కా. వెనక 14 ఏండ్ల పిల్లలు. ముసలివారుకూడ వస్తున్నారే అనే మందహాసంతో గాటోలు చిరునవ్వుతో, "కాసేపు కూర్చోండి పని యిస్తాం" అన్నాడు కామ్రేడ్ రాజేశ్వరరావు. ఆ వ్యక్తి నరసింహం. రైల్వే కూలీలతరపున ఎం. ఎల్. ఎ; మనమలతో సహా వలంటీర్లుగా పనిచేయడానికి వచ్చాడు. భోజనాలయిపోయినాయి. అన్నంలో వస్తు వుండటం చూసింది ఒక అవ్వ. యెర్రపట్టీచూచి నన్ను పిలచింది. "ఏం నాయనా! వందమందిమి ఖాళీగా వున్నాము. ఈరోజుకు బియ్యం చెరిగేపని యివ్వండి. కావలసినన్ని బియ్యం బాగుచేస్తాం" అంది. ఆ అవ్వ చేతిమీదవున్న వలంటీరు బాడ్జిమీదికి పోయింది నా దృష్టి. అవ్వల ఆశీర్వాదాలేగాకుండా సహకారంకూడ లభించినందుకు గర్వించాను.

ఆఫీసులో పనులు చాల ఎక్కువగావున్నాయి. వలంటీర్లను రిక్రూటు చేసికోవడంలో మునిగిపోయి వున్నాడు కామ్రేడ్ నరసయ్య (రాష్ట్ర విద్యార్థిసంఘ సహాయకార్యకర్త). నాకుకూడ ఒకబాడ్జి ఇవ్వండి అంటూ వచ్చాడు ఒక యువకుడు. 14 ఏండ్లుంటాయి. సుకుమారి, యెన్నడూ పనిచేసి యెరుగడు అని ముఖం సాక్ష్యం చెపుతోంది. "కామ్రేడ్. నీవు పని చేయలేవు. వద్దులే" అన్నాడు కామ్రేడ్ రాజేశ్వరరావు. పట్టుదలతో బాడ్జి తీసుకున్నాడు. కార్యదీక్షతో చివరివరకునెగ్గి, విజయగర్వంతో ఆఫీసుకొచ్చాడు. ఆ వలంటీరు కామ్రేడ్ ఎవరో తెలుసా ? ఒక జమీందారు పుత్రుడు.

ముసలివాళ్ళు, బాలురు అనే విచక్షణే లేకుండా అన్నివర్గాలనుండి వచ్చారు. వ్యవసాయ కూలీలనుండి దాదాపు 600 మంది వలంటీర్లు హాజరైనారు. మహాసభ చూడలేదు అనే విచారంతో నిస్పృహ చెందకుండా శ్రమకోర్చి పనిచేసి మహాసభను జయప్రదం మొనర్చారు. రైతుమహాసభకు కూలీలు వెళ్ళరాదని ప్రచారం చేసిన విచ్ఛిన్నకులకు సమాధానంగా రైతు-కూలీ ఐక్యతను చాటడానికై నడుం కట్టారు. వ్యవసాయకూలీ వలంటీరు కామ్రేడ్సు విజయం పొందారు.

ఇది రైతు - కూలీ ఐక్యతా చిహ్నమేకాదు. సంపూర్ణ ఆంధ్రజాతీయ సమీకరణకూడాను. ఇంతవరకు ఆంధ్రరాష్ట్రమంటే నైజాము ఆంధ్రజిల్లాల ప్రసక్తి చాలమంది హృదయాలలోలేదు. ఆంధ్ర జాతియైక్యతా చిహ్నంగా నైజామునుండి 150 మంది వలంటీర్లు మహాసభకువచ్చి ప్రజాసేవలో పాల్గొన్నారు.

# ప్రజాసైన్యం పాత్రను రుజువుచేయగల్గాం

అనుకున్న సంఖ్యలో సగంమందేవచ్చారు. 13వ తేదీవరకు నిర్మాణ కార్యకలాపాల్లో అందరం మునిగిపోయాము. యేశాఖలోనూ ప్రత్యేకశిక్షణ యివ్వ డానికి అవకాశంలేదు. అయినాగాని జయప్రదంగా మహాసభను నిర్వహించి ప్రజల మన్ననల పొందాం. ఇదెట్లా సాధ్యమైంది? దీనికి సులభంగా లభించగల సమాధానం ఒక్కటే; ప్రజాసహకారం, ప్రజాదరణ. ఈరెండూ ఉన్నాయి గనుకనే విజయమొందాం. ఇది ప్రతి వలంటీరు అనుభవంద్వారా గ్రహించాడు. యేదిచెప్పినా ప్రజలు అంగీ రించారు. ఇదివరకు యిలాంటి అనుభవం లేకపో యినా, వలంటీర్లుచెప్పినట్లు ప్రవర్తించడంద్వారా వలంటీర్లకు ప్రజలు ఎంతో శ్రమ తగ్గించారు. ఉదాహరణకు, ట్రెంచి లెట్రిన్లలోకి వెళ్ళడం ప్రజలకు అలవాటులేదు. అయినా 4గురు వలంటీర్లు వేలకొలది ప్రజలు లెట్రిన్సుకు వెళ్ళినా గలీజుగాకుండా కాపాడగల్గారు. మహాసభలో పాటించిన ఈ ఆరోగ్యసూత్రాలనే, గ్రామాల్లోగూడా పాటించితే గ్రామాలు ఎంత పరిశుభ్రంగా ఉంటాయి! ఎంతమంది మలేరియా, టైఫాయిడు, కలరా, మశూచిక జబ్బులకు బలిగాకుండా ఉంటారు! ఎంత మందు ఖర్చు తప్పుతుంది! ఎక్కడబడితే అక్కడ బయలుకుకూర్చోవడం, ఉచ్చపోయడం చెత్తవేయడం వల్లనేగదా తిరునాళ్ళలో కలరాలు పుట్టేది! అంతేగాదు. భోజనాల వద్దకూడ యిష్టము వచ్చినచోట విస్తళ్ళు పారవేసి గలీజు చేయకుండాను, బారులు తీరి వెళ్ళడంద్వారాను, ఎంతో తోడ్పడింది ప్రజానీకం. ఈ సందర్భంలో ఒక ఉదాహరణ గుర్తుకొస్తోంది. 50 యేండ్లు వుంటాయి ఆమెనమ్మకు. పంక్తి అంతటా భోజనాలు పూర్తిఅయినాయి. అందరూ లేచారు. కొత్తగావచ్చిన నలుగు రైదుగురు స్త్రీలు ముందుకు తోసుకొస్తున్నారు. అది తప్పని వారించి, లైనుల్లో నడిపించి గలాటా లేకుండా కాపాడింది. ఆమె వలంటీరుగాదు. యీ అనుభవాన్ని ఆమె వుదయం భోజనాలసమయంలో గడించింది. పబ్లికు మీటింగులోకూడ యే లైనులో నడిపితే ఆ లైనులో నడిచారు. ఎక్కడ కూర్చోమంటే అక్కడే కూర్చు న్నారు. అందువల్లనే 2000 మంది వాలంటీర్లు పబ్లికు మీటింగుకు అవసరమౌతా రనుకుంటే 1000 మందితోనే జరపగల్గాం. ప్రజల సానుభూతి, సహకారం పూర్తిగా వున్నాయిగనుకనే 7000 మంది మోయాల్సిన భారాన్ని 3500 మంది వలం టీర్లు చేయగల్గారు. ఇది దేన్ని రుజువుచేస్తోంది? ప్రజల సహకారంగల సైన్యం తనకు మించిన పనులుసైతం చేయడానికి సాహసిస్తోంది చైనా సైన్యం, యుగో స్లావియా సైన్యం ప్రపంచానికి చాటుతున్న పాఠంకూడా యిదే. వలంటీర్లు ఒక సక్రమమైన కార్యంకొరకు వున్నారనీ, తమ క్షేమంకొరకే వలంటీర్లు కృషిచేస్తా రనీ, వారి ఆశయాలు మంచివనీ అంగీకరించారు. కనుకనే ప్రజలందరూ తోడ్ప

ద్దారు. చూడండి — అక్కడివి అన్నీ తాటాకుల పందిళ్ళు. ఆకులు ఎండి గాలికి గలగల మంటున్నాయి. పరాకున ఏ బీడీరవ్వ వాటిమీదపడినా, చాల ప్రమాదం జరుగుతుందని భయపడ్డాం. మద్రాస్ ఫైర్‌సర్వీసువారిని ఒక ఫైరింజను ఆరెండు రోజులు ఇమ్మని అడిగాం. గంటకు రు. 12 అడిగారు. అందువల్ల స్థిరపుపంపులతో తంటాలు పడదామనుకున్నాం. సుమారు 20 స్థిరపుపంపు పోస్టులను పందిళ్ల చుట్టూ అక్కడక్కడా పెట్టాం. అయినా ప్రజల సహకారం లేకపోతే ఈ స్థిరపుపంపులు ఏమి చేయగల్గుతాయి? అందుచే ప్రజలు అవలంబించాలిసిన విధులను పెద్ద కాగితాలమీద అచ్చువేసి, అట్టలమీద అంటించి, అక్కడక్కడ కట్టాం. ప్రజలు చుట్టలు, బీడీలు పందిళ్ళకు దగ్గరగా కాల్చడం చాలవరకు మానివేశారు. ఎవరైనా కాల్చుతుంటే వాలంటీర్లు హెచ్చరించేవారు. ప్రజలు కాల్చిన తరువాత వాటిని ఆర్పివేసేవారు. స్త్రీలుగూడ ఈ విషయంలో ఎంత జాగ్రత్తగా ఉన్నారో చూడండి. పెండాలుకు ఉత్తరపువైపున మామిడిచెట్లతోపు ఉంది. దానిలో బస్సు విడిచారు. 14 సాయింత్రం సమయం. పైరుగాలి వస్తోంది. స్త్రీలు మహాసభకు హాజరవడానికి త్వరత్వరగా వంటలు చేస్తున్నారు. కొన్నిపొయ్యిలు పెండాలు దడికి 10 గజాలలో వెలుగుతున్నాయి. ఆ ఎండు ఆకులమీద ఒక్క రవ్వపడితే, ఎంతో ప్రమాదం జరుగుతుంది. ఈ విషయం వారితో చెప్పాం. వారు వెంటనే అంగీకరించారు. పురుషులు బళ్ళను పెండాలుకు 50, 60 గజాలదూరంగా తీసుకుపోయారు. అబ్బ! ఏటేటా ఎండాకాలంలో చుట్టా బీడీలు ఆర్పిపారవేయకపోవడం వల్ల, పొయ్యిలవద్ద అజాగ్రత్తగా ఉండటంవల్ల, ఎన్ని ఇళ్ళు, వాములు, గొడ్లచావిళ్ళు అగ్నిదేవుడికి ఆహుతి అవుతున్నాయి! ఈ జాగ్రత్త తీసుకుంటే, ఏటేటా ఎంత ఆస్తినష్టం జరుగకుండా ఉంటుంది!!

## ఊరేగింపులో

14 తేదీ ఉదయం 5 గంటలయింది. వాలంటీర్లను లేపడానికి బ్యూగిలు వేయబడింది. ఊరేగింపులో పాల్గొందామనే ఉత్సాహంతో, వాలంటీర్లు త్వరత్వరగా కాలకృత్యాలు తీర్చుకొని వచ్చి లైనులలో నిలబడ్డారు. వంటశాలకు కాపలాకు వెళ్ళాలిసిన దళాలు వెళ్ళిపోయాయి. మిగతాదళాలు వరుసగా నిలబడినాయి. సెంట్రలుసంగడదళం నైతుప్రముఖులను తీసుకురావడానికి అలంకరించబడిన బండ్లతో మొగలరాజపురం వెళ్ళింది. ఇంతలో ఈమ్పుగల్లు భజనదళం ముందుకువచ్చి ఫాసిస్టు వ్యతిరేక కీర్తనలను గంతులేస్తూ పాడడం మొదలుపెట్టింది. యలమర్రు వ్యవసాయకూలీ [illegible] మన పురాతనపు వాయిద్యమయిన తప్పెట్ల వాయిద్యాన్ని మొదలుపెట్టారు. ప్రజలు తమను తాము మంచిపోయి దానిలో మునిగి

పోయారు. వాలంటీర్ల వళ్ళు పులకరించింది. రణరంగానికి పోతున్నామా అని పించింది. ఇంతలో స్వామీజీ, బంకిమ్, పృధ్వీసింగు మొదలయిన రైతునాయకులు ఎడ్లబండ్లమీద, వాలంటీరుదళం బ్యాండుతో ముందునడుస్తూ, ఊరేగింపు వచ్చింది. ఆ రైతునాయకులు ఆసీనులయివున్న బండ్లవెనుక వివిధరాష్ట్రాల రైతు ప్రతినిధులు బారులుతీరి నడిచారు. ఆవెనుక ఒక వాలంటీరుదళం, తరువాత స్త్రీల దళం, ఇతర స్త్రీలు ఊరేగింపులో కలిశారు. పసిపిల్లల తల్లులు, నిండుగర్భిణీ స్త్రీలు వాలంటీర్లుగా రాగూడదని ముందే కబురుపంపాం. కాని ఈ మహోత్సవంలో వారిని ఆపడం ఎవరితరం? ఊరేగింపులో పసిపిల్లల తల్లులుగూడవచ్చి నిలబడ్డారు 4 గంటలసేపు నడవలేరనీ, పిల్లలకు ఎండదెబ్బ కొడుతుందనీ, కొందరికి నచ్చచెప్పి వెనుకకు మరల్చాం. ఇంతలో ఒక నిండు గర్భిణీ స్త్రీగూడ ఊరేగింపులో కన్పించింది. ఆమెను వెళ్ళవద్దని నిరోధించి, వరుసబయటికి తీసుకు వచ్చేటప్పటికి కంటతడిపెట్టింది. స్త్రీదళంవెనుక మరొక వాలంటీరుదళం, తరువాత ప్రజలు, మరల వాలంటీరుదళం, ఈవిధముగా ఊరేగింపు షుమారు 20,000 మందితో సాగింది. ఇంకా బయట 25,000 మంది ప్రజలు ఉన్నారు. 14 తేదీ ఉదయానికే ఇంతమంది ప్రజలు వస్తారని అనుకోలేదు. అందుచే జండా ప్రతిష్ఠాపనలో ప్రజలను సర్దడానికి 200 మందినే ఉంచాం. కాని ఉదయానికి షుమారు 50,000 మంది ప్రజలు వచ్చేటప్పటికి, ఊరేగింపునుండి 500 మందిని తిప్పి తీసుకువచ్చాం. వారికి ఊరేగింపులో పాల్గొననీయలేదని కష్టంకలిగింది. వారికి మహాసభను జయప్రదంగా సాగించడానికి వాలంటీర్లు త్యాగం చేయాలిసిన అవసరాన్నిగూర్చి చెప్పాం. వారు అంగీకరించారు.

మహాసభ ఆవరణ 10 యకరాలను కొన్ని కొన్ని భాగాలుగా విభజించి, వాటి మధ్యదార్లు ఏర్పరచి, ఆదార్లకు వాసాలుపాతి, తాడుకట్టాం. వాలంటీర్లు దార్లపొడుగునా నిలబడ్డారు. కామ్రేడ్ తమ్మారెడ్డి (ఆంధ్రరాష్ట్ర విద్యార్థిసంఘ కార్యదర్శి) ప్రతి భాగంలోను 100 మంది ప్రజలకు ఒకకుండ చొప్పున వరుసగా కుండలను పెట్టించి నీరు పోయించాడు. మంచినీళ్ళు ఇయ్యడానికి కుండకొక వాలంటీరును నిలబెట్టాడు. ఇదంతా పూర్తిఅయ్యేటప్పటికి 11 గంటలయింది. ఊరేగింపు తిరిగి వచ్చి నగరంలో ప్రవేశించింది. మొత్తం 5`,000 మంది ప్రజలు వచ్చారు. అందరినీ వాలంటీర్లు తాళ్ళు కట్టబడిన భాగాలలోకి పంపి కూర్చోబెట్టారు.

జండా ప్రతిష్ఠాపనోత్సవం పూర్తిఅయింది. అపూర్వ సక్రమంగానే గడచి పోయింది.

## నీటి సరఫరా

భోజనాలు పూర్తిఅయ్యేసరికి 3 గంటలయింది. వాలంటీర్లు భోజనాలుచేసి పందిళ్ళలో కూర్చునేటప్పటికే. ప్రజలు సాయింత్రం సభసరావడం మొదలు పెట్టారు. ఎండ ఎక్కువగాఉంది. వేళతప్పి అన్నం తినడంతో 3 మంచి నీళ్ళ కుండీలలోని నీరుఅంతా మీటింగు అరంభం కాకముందే అయిపోయింది. మీటింగు 4½ గంటలకు అరంభమయింది. లక్షమంది ప్రజలు కిటకిటలాడుతున్నారు. మంచినీళ్ళకు ప్రజలు అల్లాడిపోతున్నారు. ఎక్కడవచ్చిన నీళ్లపీపాలు అక్కడే సరిపోతున్నాయి. తమ బిడ్డలైన వాలంటీర్లు ఇంత కష్టపడుకుంటే. ప్రజలు నీళ్ళు కావాలని గల్లంతుచేయలేదు. అంతా ఓర్పుతో అలాగే మండుటెండలో కూర్చు న్నారు.

నీళ్ల యిద్దడికితోడు. పడమటివైపున రెండు లౌడుస్పీకర్లు చెడిపోయినాయి. ఆవైపు ప్రజలకు వినపడటంలేదు. ప్రజలు వినపడటంలేదని గౌణిగారు. లౌడ్ స్పీకర్లు యింకా అదనంగా తెచ్చిపెడతామని చెప్పితే. విని ఊరుకున్నారు. రెండు గంటలలోనే అదనంగా కొన్ని లౌడుస్పీకర్లు తెచ్చి అమర్చబడినాయి. కాని ఆరోజు సభ సంతృప్తికరంగాలేదు. నీళ్ళు యింకా చాల నిలవవుంచితేనేగాని పని జరగదనుకున్నాం. కామ్రేడ్సు సుందరం. తమ్మారెడ్డి. ఈ బాధ్యతను తీసుకు న్నారు. కుండీలన్నీ పూర్తిగా నింపబడినాయి. మొత్తం 4000 కుండలలో నీరు నింపి. ప్రతి భాగంలోనూ ఉంచబడినాయి. ఈపనిలో హైదరాబాదుదళం చాల ప్రశంశనీయంగా పనిచేసింది. అందులో ఎన్నడూ పని ఎరుగని సుకుమారులు. చాలమంది. బి. ఏ., ఎం. ఏ., చదువుకున్న ముస్లిం సోదరులుకూడ వున్నారు. చేతులు బొబ్బలెక్కినా. పట్టుదలతో పనిచేశారు. లౌడుస్పీకర్లుకూడ చక్కగా వినిపించుతున్నాయి. ప్రజలుగూడ శిక్షణ నేర్చుకున్నారు. 15వ తేదీని సభ జయ ప్రదంగా ముగిసింది.

## స్త్రీ వలంటీర్ల కృషి

20 వేలమంది స్త్రీలుమహాసభకువచ్చారు. పిల్లలతోకూడ వచ్చారు కొంత మంది. వీరందరికీ తగిన వసతులు చూచుటకు. వంటలో పాల్గొనుటకు. ముందుకు వచ్చి పనిచేసిన స్త్రీ వలంటీర్ల కృషిని గూర్చి చెప్పాలి మొత్తం 300 మందిని వలంటీర్లుగా చేర్చుకున్నాం. వారిలో 120 మంది ముసలమ్మ లున్నారు. 80 మంది 10, 11 తేదీలలోనే వచ్చారు.. ఈ వచ్చిన 300 మంది 3 భాగాలుగా విభజింప బడ్డారు. 1: వంటశాలవద్ద కూరలు తరగడం, పులుసుకాయడం మొదలైన పనులు

చేయుటకు. 2. ఆరోగ్యమునకు సంబంధించిన విషయాలు చూచుటకు, చిత్ర ప్రదర్శన శాలలో విషయాలు చెప్పుటకు 3. పబ్లిక్ మీటింగు, కాపలా.

ముందు వంటశాలలో పనిచేసే స్త్రీ వలంటీర్ల కృషిచూద్దాం. అందుకు నియమింపబడినవారు ఎంతో బాధ్యతతో ఆ రెండు రోజులు ముందుగనే తమ పనిని పూర్తిచేసి ఆ తరువాత ఉత్సాహంతో సభాప్రవేశానికి వచ్చేవారు. ప్రజాసేవ చేయుటకు స్త్రీలు చూపిన ఉత్సాహం ఒక చిన్న ఘటననుబట్టి తెలుసుకోవచ్చు. 14 వ తేదీ ఉదయం బ్రహ్మాండమైన ఊరేగింపు బయలుదేరింది. అందరికీ ఊరేగింపులో పాల్గొనవలెనని ఉత్సాహమున్నది. కాని వంటశాలలో కూరలు తరుగుటకు 70 మంది స్త్రీలు వెంటనే రావాలని విజ్ఞప్తిచేయగనే యిదికూడ ఎంత ప్రధానమైన పనో గుర్తించి, 150 మంది స్త్రీలు ఒక్కసారిగా లేచి మేము వస్తామంటే మేము వస్తామని నిలబడ్డారు. తరువాత ఇంతమంది అవసరంలేదని కూర్చోబెట్టవలసి వచ్చింది.

మహాసభ రెండురోజులేగాక, అంతకు ముందునుండి మహాసభకు ఏర్పాట్లు చేస్తున్న వలంటీర్లకు వంటచేసి పెట్టుటకుగాను కొంతమంది స్త్రీ వాలంటీర్లు పనిచేశారు.

## ఆరోగ్యం విషయంలో

ఆరోగ్యం విషయంలో స్త్రీవలంటీర్లు చేసినకృషి ప్రశంసాపాత్రం. జబ్బుచేసిన వారిని ఎప్పటికప్పుడు హాస్పిటలుకుచేర్చుట వారికి సేవలుచేయుట చేశారు. పాయిఖానాదొడ్ల దగ్గరవుండి స్త్రీలకు మార్గంచూపుతూ, ప్రత్యేకించిన స్థలాలలోకి వెళ్ళేటట్లు చూశారు. ఎక్కడబడితే అక్కడ గలీజు చేసినందువల్ల ఏవిధంగా ఆరోగ్యం చెడిపోతుందో స్త్రీలందరికీ నచ్చజెప్పి. శిక్షణను పాటించేటట్లుచేశారు ఈవిధంగా ఆరోగ్యాన్ని కాపాడుటలో సహాయపడ్డారు. ఈ ఏర్పాటులు, యీ సేవచూచి అందరూ ఆశ్చర్యచకితులైనారు.

ఆరోగ్యవిధుల్ని గురించి బోధిస్తూవున్న ప్రదర్శనాల్లోను, సోవియట్ బెంగాల్ చిత్రాల ప్రదర్శనాలను ప్రజలందరికీ బోధించుటలోను, కొంతమంది స్త్రీ వలంటీర్లు పాల్గొన్నారు. వీరు ప్రజలందరికీ విసుగుచెందకుండా నేర్పుతో, ఓర్పుతో, అర్థమయే రీతిని చెప్పారు. వీటిపైన నిపుణులైన అభిప్రాయాలనుచూస్తే స్త్రీ వలంటీర్లు ఎంత నేర్పుతోచెప్పిందీవిశదమౌతుంది. ఒక రెవిన్యూ ఇన్స్పెక్టరుగారు తన మిత్రునితో యీ విధంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. "యింతవరకు మహిళా ఉద్యమమంటే నాకు సదభిప్రాయముండేదికాదు. ఆ స్త్రీలు అంత నేర్పుతో చెప్పడంచూస్తే వారిలో కల్గిన అభివృద్ధిని చూసి నా కాశ్చర్యం వేసింది" అని

అన్నాడు. నిజమే! మహిళాసంఘం తన వర్కర్లను ఏవిధంగా అభివృద్ధిచేస్తున్నదీ ప్రజలకు తెలియనంతకాలం కొందరు దుష్టులు. సమాజాభివృద్ధిని కోరనివారు, మహిళా వర్కర్లను గూర్చి దుష్ప్రచారం చేయగల్గారు. మహిళా స్కూల్సులో శిక్షణపొందుటకు వచ్చిన స్త్రీలను గూర్చి దుష్ప్రచారం చేశారు. పత్రికలుసైతం చదవలేనివారికి ఆస్కూల్సులో యిచ్చిన శిక్షణఫలితంగానే ఆ వర్కర్లలో యింత అభివృద్ధి కనబడుతోందనేది గ్రహించారు. తమ పుత్రికల, సోదరీమణుల సేవను చూచి ప్రజలు గర్విస్తున్నారు. దుష్ప్రచారం చేసే వారికి యీ ప్రజలే తగిన సమాధానమిస్తారు.

బహిరంగసభలోకూడ స్త్రీలు నిశ్శబ్దంగా, శ్రద్ధగాచూచారు; విన్నారు. బిడ్డలు ఏడ్వకుండా వుండుటకుగాను స్త్రీ వలంటీర్లు బిడ్డలకు బిస్కట్లు పంచిపెట్టారు. పసిబిడ్డలకు పాలుపంచారు. ఎప్పటికప్పుడు స్త్రీలందరికీ మ చినీళ్ళు సప్లయిచేయుటలో ఆదర్శవంతమైన కృషిచేశారు. స్త్రీలను సర్దుటలోను, మార్గంచూపుటలోను, వారి యిబ్బందులను తీర్చుటలోను తమ స్థానంలో నిలబడి చక్కని క్రమశిక్షణతో మెలిగారు. వీరిలోనున్న క్రమశిక్షణ స్త్రీ జనసామాన్యమంతటా ప్రతిబింబించింది.

## వలంటీర్ ర్యాలీ

16 వుదయం వలంటీర్ ర్యాలీ జరిగింది. ఏ దళానికాదళం, 3 వరసల్లో బారులుతీరివుంది. ముందు కమాండర్లు, తరువాత స్త్రీలదళం, ఆవెనుక పురుషులు, అన్నిదళాలకు వెనుక అవసర పరికరాలతో డాక్టర్ల దళం. డయాస్‌పైన కామ్రేడ్ రాజేశ్వరరావు ఆజ్ఞలు ఇస్తున్నాడు. ప్రతి దళం జండాకు వందనంజేస్తూ ముందుకు పోయింది. 3000 మంది వలంటీర్లు ఎర్రజండాలతో సైన్యంవలె ముందుకు కదులుతూవుంటే ఎవరికి ఉత్సాహం ఉప్పొంగదు? కామ్రేడ్ జోషి, అధికారి, సుందరయ్య శాల్యూట్ అందుకుంటూ నిలబడ్డారు. "అరే, ఆ ముసలమ్మకూడ కదం తొక్కుతుందే!" అన్నాడు ఆశ్చర్యంగా ప్రక్కనిలబడి చూస్తున్న ప్రజలలోని ఒక వ్యక్తి. "ఆముసలమ్మ ఎంతపనిచేసిందో యీమహాసభలో నీకుతెలుసా?" అన్నాడు యింకో వ్యక్తి సమాధానంగా. ర్యాలీ పూర్తిఅయింది. ప్రతివలంటీరు విజయగర్వంతో క్యాంపులకు వెళుతున్నాడు. నేను ఆఫీసుకు పోతున్నాను. నాప్రక్కనే 10 మంది వలంటీర్లు, యింకా యితరులు కలిసి పందిరిలోకి పోతున్నారు. "మీరు మహాసభను కూడ చూడకుండ చచ్చేంతపని చేయబట్టే మహాసభ నెగ్గింది" అన్నాడు ఒకాయన. ఆయనచేతిమీద బాడ్జిలేదు. "మహాసభను చూడకపోయినా, మా శ్రమవల్లనేగదా యింత మహాసభ జరిగింది! అని అలోచించుకుంటే నాకు బలే గర్వంగావుందిలే!"

అంటూ ఒక్కగంతు వేశాడు ఒక వలంటీరు. "ఏ ఇబ్బందీలేకుండా మూడు రోజులు వుండి ఆనందంగా యింటికి వెళ్ళే ప్రజలను చూస్తూంటే, మనకు ఎంత గర్వంగా వుందో చూచారా?" అంటూ అందుకున్నాడు ఒక వ్యవసాయకూలీ కామ్రేడ్. గడిచి గట్టెక్కాంకదా! అని ఆఫీసులో రెండు గంటలు నిద్రపోయాను.

## నాయకుల ప్రశంసలు

సాయంకాలం కామ్రేడ్ జోషీ ఉపన్యాసం జరిగింది. వలంటీర్లకు ప్రత్యేకంగా సందేశాలివ్వడానికి నాయకులు వచ్చారు. వారిలా చెప్పారు:

"మాస్కో రెడ్ స్క్వేర్ గుర్తుకువచ్చింది."

— విధాన్ సింగ్.

"ఇంత కట్టుదిట్టంగా వలంటీరు నిర్మాణం వుండటం యింతవరకు నేచూడలేదు."

— బంకిం.

"అమెరికాలోకూడ యిలాంటి వలంటీరుదళాన్ని నే చూడలేదు."

— జగజిత్ సింగ్.

యీ వ్యాఖ్యానాలన్నీ వింటూంటే ప్రతి వలంటీరుకు శరీరం వుప్పొంగింది. తమ శక్తిని తాము యిప్పుడు అర్థం చేసుకుంటున్నారా అన్నట్లు ముఖాలు వికసించాయి; సభపూర్తియింది.

పంచాయతీ వేమన గ్రంథాలయం, తేలప్రోలు :: కృష్ణా జిల్లా.

58

ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B170 |
| పుస్తకం పేరు | 8వ అఖిలభారత రైతుమహాసభ |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 79 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 1, 2U, 8[illegible], 32B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Thriveni |
| పేజీలు విడదీసినది | Thriveni |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |